# కమ్యూనిజం

మార్చి 1998

వెల : రు. 6/-

# కమ్యూనిజం

మాసపత్రిక

సంపుటి : 22 మార్చి 1998 సంచిక : 9

## విషయసూచిక

సంపాదకవర్గం :

ఈడ్పుగంటి నాగేశ్వరరావు

(సంపాదకులు)

పరకాల పట్టాభిరామారావు

ముళ్లపూడి సూర్యనారాయణ

---

"కమ్యూనిజం" పత్రికలో వెలువడుతున్న వ్యాసాలలోని భావాలతో సంపాదకవర్గం ఏకీభవించ నక్కరలేదు. అవి రచయితల అభిప్రాయాలు మాత్రమే.

-సంపాదకవర్గం

---

కమ్యూనిజం చందా వివరాలు

విడి ప్రతి : రు. 6/-

సంవత్సరచందా : రు. 72/-

వివరాలకు

మేనేజర్, కమ్యూనిజం

చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520 004.

2

# ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ 22వ మహాసభలు-సమీక్ష

జనవరి 10 - 12 - 1998. హైదరాబాద్.

**ఆచార్య వకుళాభరణం రామకృష్ణ**

ఆంధ్రప్రదేశ్ చరిత్రకారులు రెండు దశాబ్దాల క్రితమే నెల్లూరు జిల్లా కావలిలో సమావేశమై చరిత్ర అధ్యయనాన్ని అభివృద్ధిపర్చాలనీ, చరిత్రరచనలో ఎదురౌతున్న సమస్యలను పరిష్కరించుకోడానికి సదస్సులు నిర్వహించాలనీ తీర్మానించుకున్నారు ప్రముఖ చరిత్ర కారులైన కొమర్రాజు లక్షణరావు, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, రాళ్లబండి సుబ్బారావు, సురవరం ప్రతాపరెడ్డి, భావరాజు వెంకటకృష్ణారావు, నేలటూరి వెంకటరమణయ్యల కృషిని స్ఫూర్తిగా తీసుకుని ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ ఆవిర్భావానికి కృషి చేసింది. 1976లో ప్రారంభమైన ఈ సంస్థ ఆంధ్రదేశంలో పలు ప్రాంతాల్లో సదస్సులు నిర్వహించింది. ఆ పరంపరలో 22వ సదస్సును హైదరాబాద్‌లో నిర్వహించడానికి హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం చరిత్రశాఖ సగర్వంగా బాధ్యతను స్వీకరించింది.

## ప్రత్యేక ఆశయం

ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ ఈ సదస్సును ఏర్పాటు చేయటంలో ఒక ప్రత్యేక ఆశయం ఉంది. అది ఆయా ప్రాంతాలకు చెందిన చరిత్ర రచనలు అభివృద్ధి పర్చాలని ఆకాంక్ష. ఈ శతాబ్ది ప్రారంభంవరకూ చారిత్రక రచలనగానే, ప్రపంచ, జాతీయోద్యమం బలపడ్తూన్న కొద్దీ, ప్రాంతీయ భాష, సాహిత్యాల వికాసానికి అంకురార్పణ జరిగింది. దేశభక్తి పూరితమైన స్ఫూర్తితో నూతన సాహితీ సంప్రదాయాలు, నూతన రచనాపద్ధతులు, ఆవిష్కృతం అయ్యాయి. తద్వారా జాతీయచైతన్యం ఏర్పడటానికి, వలస వాదనను వ్యతిరేకించటానికి అవకాశం ఏర్పడింది. ఇది భారత దేశ చరిత్ర రచనలో ప్రధాన మలుపు. తదనంతర కాలంలో జాతీయ వాదశాఖ వృద్ధిచెందడానికి కారణం ఇదే. అటుపిమ్మటే చరిత్ర రచనలో ఆయా ప్రాంతాలకు సంబంధించి రచన వృద్ధి చెందింది.

ప్రాంతీయ చరిత్రలు దేశ చరిత్ర రచనకు వ్యతిరేకాలనే భావన చారిత్రకుల్లో కొంతకాలం వరకూ ఉండేది. కాని వివిధ ప్రాంతీయాలకు చెందిన సామాజిక, ఆర్థిక, రాజకీయ పర్యావరణాది చారిత్రకాంశాలను పరిగణనలోకి తీసుకొని దోహదపడ్తుందని

ఆధునిక పరిశోధనలు నిరూపిస్తున్నాయి. ప్రాంతీయ చరిత్రాంశాలను రాయటంలో పరిశోధకునికి సౌలభ్యం ఉంది. స్థానిక చారిత్రక శిథిలాలు, వ్యక్తిగత వివరాలు, కౌటుంబిక అంశాలు, మౌఖిక సంప్రదాయాలు మొదలైన అంశాలను సూక్ష్మంగా అధ్యయనం చేయడం ద్వారా స్థూలాధ్యయనంలో లభించిన అనేక అంశాలు విశదమౌతాయి. ప్రాంతీయ చరిత్రలు (Regional Histories) పై కేంద్రీకరించటంలో ఈ సౌలభ్యం ఉన్నా, ప్రాంతీయతా వాదం చరిత్ర రచనలో ప్రవేశించే అవకాశం ఉందనీ, దాన్ని పరిహరించాల్సిన బాధ్యత పరిశోధకులదని ఆంధ్ర ప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ భావిస్తుంది. ఆంధ్ర దేశ చరిత్రపై జరిగే కృషిని దేశ చరిత్ర రచనతో సమన్వయం చేయటం ద్వారా చరిత్ర రచనలో వివిధ ప్రాంతాల మధ్య ఉన్న అసమానతలను సరిచేయడానికి వీలౌంతుందనే భావనతో ఆంధ్రదేశంలో నిర్వహించిన ఈ సదస్సులకు నేటి వరకు ఎంతో మంది ప్రముఖ చరిత్ర కారులైన ఆర్.ఎస్. శర్మ, టి.వి. మహాలింగం, సర్వేపల్లి గోపాల్, రొమిల్లా థాపర్, ఇర్ఫాన్ హబీబ్, బిపిన్ చంద్ర, కె.ఎన్. పణిక్కర్, ఎం.జి.యస్. నారాయణలను అధ్యక్షులుగా ఆహ్వానించటం జరిగింది.

ఈ సంవత్సరం వార్షిక సభలు, మూడురోజులపాటు, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో, చరిత్రశాఖా విభాగం ఆధ్వర్యంలో జరిగాయి.

## రాష్ట్ర సమగ్ర చరిత్ర రచన

ప్రముఖ ఆర్థికశాస్త్రవేత్త, రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్ ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ గవర్నర్ డాక్టర్ చక్రవర్తి రంగరాజన్ మహాసభలను ప్రారంభించారు. ప్రారంభోత్సవంలో చరిత్ర అధ్యయన ఆవశ్యకతను గూర్చి వక్కాణించారు. కేవలం వాస్తవాల, గతకాలపు ఘటనల సమాహారం చరిత్ర కాదంటూ, అవి చరిత్రకారుల ప్రాపంచిక దృక్పధంలో మేళవింపబడి ఆసక్తి దాయకమైన, సమకాలీన భవిష్యత్ సమాజ నిర్మాణానికి దోహదం చేయాలన్నారు. ఒకజాతి నెమరువేసుకొనే గతకాలపు జ్ఞాపకాల దొంతరగా చరిత్రను అభివర్ణించారు. చరిత్ర అందించే గుణపాఠాలను బేరీజువేసుకుంటూ, వర్తమానాన్ని అవగతం చేసుకుని, భవిష్యత్‌కు పునాదులు వేయాలన్నారు. ప్రాంతీయ చరిత్రల ప్రాముఖ్యాన్ని వివరించి అవి జాతీయ స్థాయిలో చరిత్ర పునర్నిర్మాణానికి అడ్డురాకపోవడమే కాకుండా, దేశచరిత్రను పరిపుష్టం చేస్తాయని అభిలషించారు. ఆసక్తికరంగా సాగిన ప్రారంభోపన్యాసంలో, డాక్టర్ రంగరాజన్, ఆంధ్ర ప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్, రాష్ట్ర 'సమగ్ర' చరిత్ర రచనకు పూనుకోవడం పట్ల హర్షం ప్రకటించారు .ఆంధ్రప్రదేశ్‌లో చరిత్ర గ్రంథాల రచనలో చోటు చేసుకున్న లోపాలను సరిదిద్దడానికి హిస్టరీ కాంగ్రెస్ చేస్తున్న ప్రయత్నాలను ఆయన సమర్ధించారు.

ఇరవై రెండవ సభలకు అధ్యక్షత వహించిన ఆచార్య వెల్చేరు నారాయణరావు (విస్కాన్‌సిన్ విశ్వవిద్యాలయం, మాడిసన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు), ఆంధ్రప్రదేశ్ చరిత్ర రచనకు వుపకరించే ఆధారాలగూర్చి, ముఖ్యంగా సాహిత్య పరమైన అంశాలను

వివరించారు. గత యిరవై రెండేళ్లలో, చరిత్ర సంస్థ సాధించిన అధ్యయన విజయాలను, ప్రచురించిన వ్యాసాలను, చరిత్ర సామాగ్రిని ప్రస్తుతించారు.

పరిశోధనా పత్రాల సమర్పణ, ప్రాచీన మధ్యయుగ, ఆధునిక, చరిత్ర రచన, స్థానిక చరిత్ర అనే అయిదు విభాగాల్లో జరిగింది. మొత్తం 110 పత్రాలు సమర్పించబడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విశ్వవిద్యాలయాల నుండి, విశాఖ పట్నం నుండి చిత్తూరు దాకా, కర్నూలు, శ్రీశైలం నుడి వరంగల్ దాకా, అనేక అనుబంధ కళాశాలల నుండి 250 మందికి పైగా ప్రతినిధులు హాజరయ్యారు. ఇంత పెద్ద సంఖ్యలో ప్రతినిధులు రావడం యిదే మొదటిసారి. దక్కన్ చరిత్రకు పునాదులు వేసి ఆద్యుడైన ఆచార్య షీర్వానీ పేర ఒక ద్వారం, ఆంధ్రుల సాంఘిక చరిత్ర పై ప్రామాణిక రచనలు చేసిన సురవరం ప్రతాపరెడ్డి పేరుతో మరొకద్వారం, సభాస్థలి ప్రాంగణాన్ని అలరించాయి.ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, ఆంధ్ర ప్రదేశ్ వారు విడివిడిగా రెండు ఎగ్జిబిషన్లు, సాలార్‌జంగ్ మ్యూజియం, వారు భారతదేశ స్వాతంత్ర్య పోరాటంపై ఒక ఎగ్జిబిషన్, దక్కన్ న్యూమస్ మాటిక్స్ సొసైటీ వారు చారిత్రక నాణాలపై (శాతవాహనుల కాలంనుండి, కుతుబ్ షాహీల దాకా- బంగారు నాణేలతో సహా) ఏర్పాటు చేసిన ఎగ్జిబిషన్ ప్రతినిధులను విశేషంగా ఆకట్టుకున్నాయి. విశ్వవిద్యాలయంలోని పలువురు అధ్యాపకుల, విద్యార్థులకివి విద్యాపరమైన, చారిత్రక సమాచారాన్ని అందించాయి. ఓరియంట్ లాంగ్మన్స్, ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి ప్రచురణాలయాల పుస్తకాలు, విశాలాంధ్ర, ప్రజాశక్తి ప్రచురణాలయాలు యింకా మరెందరో ఏర్పాటు చేసిన గ్రంథసముదాయాలు, పాఠకులను ఆకట్టుకొన్నాయి.

## ఆసక్తికరంగా చర్చలు

ప్రాచీన చరిత్ర విభాగానికి మద్రాసు విశ్వవిద్యాలయ చరిత్ర ఆచార్యులు శ్రీ షణ్ముకం అధ్యక్షత వహించగా, మధ్యయుగాలకు డాక్టర్ ఘంటా జవహర్‌లాల్ (హైదరాబాద్ ఆర్కియాలజీ శాఖ), ఆధునిక చరిత్రకు ఆచార్య సుదర్శనరావు (కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్), చరిత్ర రచనావిభాగానికి మంగుళూరు విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య కేశవన్‌వెలుథట్, స్థానిక చరిత్రకు ఆచార్య నఖ్వీ (ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్) అధ్యక్షత వహించారు. తమ, తమ విభాగాలకు సంబంధించి, ఇటీవలి కాలంలో వెలువడ్డ రచనలను ప్రస్తావించి ఒక దృక్కోణాలను చరిత్ర కారులు ఆకళింపు చేసుకుని, చరిత్ర పునర్నిర్మాణానికి తోడ్పడాలని సూచించారు.

ప్రాచీన విభాగంలో సమర్పించబడిన పత్రాలలో వేంగి దేశంలో, పట్టణ సంస్కృతీ పెంపుదల, గుండ్ల కమ్మవాగు ప్రాంతంలో నెలకొన్న రోమన్ వాణిజ్య కార్యకలాపాలు, బౌద్ధముని శూన్యవాదం, పోలమూరు గ్రాంటు శాసనాలు, సముద్రతీర ఉత్తరాంధ్రలో స్థూపనిర్మాణం, ఆంధ్రప్రదేశ్ తొలిచారిత్రక దశలో సంస్కృతీ నిర్మాణం మొదలగు పత్రాలు సమర్పింపబడ్డాయి.

మధ్యయుగ విభాగంలో చర్చలు ఉత్కంఠను కలిగించాయి. తిరుమల-తిరుపతి దేవస్థానం ప్రచురించిన శాసనాల్లో ప్రతిఫలించిన స్త్రీల స్థితి గతుల గూర్చి, కుతుబ్‌షాహీల సంస్కృతీ వైభవం అది మిగిల్చిన సాంప్రదాయం గూర్చిన పత్రాలతోపాటు, డక్కన్ మీనియేచర్ చిత్రలేఖనాల్లో ప్రస్ఫుటమైన స్త్రీ జీవితాల గూర్చి పత్రాలు వచ్చాయి. మధ్యయుగాల ఆంధ్రదేశ చరిత్రలో వీరశైవమత ప్రాముఖ్యాన్ని వివరించి, ఆ.మతశాఖ స్త్రీలకు సంబంధించి చేపట్టిన సంస్కరణల గూర్చి మరోపన్యాసం-'స్త్రీ' కేంద్రబిందువుగా అనేక పత్రాలు రావడం హర్షణీయం. స్త్రీలు ధరించిన దుస్తులు, ఆభరణాలగూర్చి మరొక పత్రం గ్రామ సరిహద్దులు నిర్ధారించిన రీతి, అది గ్రామ పరిపాలనను, ఆర్థిక వ్యవస్థను దోహదం చేసిన వివరాల గురించి మరొక పత్రం సమర్పించబడింది.

ఈ సంవత్సర సమావేశాల్లో, ఆధునిక చరిత్ర విభాగంలో ఒక సెక్షన్, స్వాతంత్ర్య స్వర్ణోత్సావాలను పురస్కరించుకొని, జాతీయోద్యమ అధ్యయానికి, అవగాహనకు పూర్తిగా కేటాయించారు. స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీల పాత్ర, 19వ శతాబ్దంలోనే బ్రాహ్మణేతర కులాల్లో వచ్చిన సామాజిక స్పృహ, జిల్లాల వారీగా స్వాతంత్రోద్యమ చరిత్రలోని ముఖ్యఘట్టాలు, ప్రజా కళాకారుడు నాజర్‌పై మరొక పత్రం, వలస పాలనలోని ఆంధ్రదేశంలో వైద్యవిధానం, ముఖ్యంగా ఆయుర్వేద వైద్యానికి ఆచంట లక్ష్మీపతి చేసిన పరిశోధన, సేవ, అది సమాజంలో, వలసపాలన ప్రవేశపెట్టిన 'ఇంగ్లీషు' వైద్య విధానపు తాకిడిని తట్టుకోలేక పోయిందో, వివరించింది మరొక వ్యాసం. జాషువా సాహిత్యం-జాతీయోద్యమం, కమ్మకులస్తులలో, ఈ శతాబ్దంలో పెల్లుబికిన కుల చైతన్యం, నేరస్త జాతులు, కొడవటి గంటి కుటుంబరావు రచనల్లో వెల్లడయిన కుటుంబ, వివాహ వ్యవస్థల రూపురేఖలు, దేవదాసీ వ్యవస్థ, రఘుపతి వెంకటరత్నం నాయుడి సంస్కరణ కృషి, మొదలగు పత్రాలు సమర్పించబడ్డాయి.

స్థానిక చరిత్రలో హైదరాబాద్ సంస్కృతి పై ఒక పత్రం, గ్రామాన్ని మార్చిన అధ్యయనం, ద్వారంపాడు గ్రామ చరిత్ర-జొన్నలగడ్డ రామలింగయ్య, నా తెలంగాణా స్త్రీ జాగృతి, చరిత్ర రచన విభాగంలో తృణమూలాల్లో వున్న జాతీయ నాయకుల జీవితాలపై ఆధారపడి చేయాల్సిన జాతీయోద్యమ రచన, చరిత్ర పాఠ్యగ్రంధాలపై విమర్శనాత్మక పత్రం మొదలైన పత్రాలు సమర్పించారు. పత్ర సమర్పణతో పాటు సాగిన దీర్ఘచర్చలు, ఒక్కోసారి మధ్యాహ్నం రెండు గంటల దాకా కొనసాగుతూవుండేవి. వ్యాఖ్యలు,వివరణలు, వివాదాస్పద అంశాలపై తర్జన భర్జనలతో, ప్రతినిధుల పత్ర సమావేశాలు ఎంతో బాగున్నాయని ప్రతినిధులందరూ భావించడం గమనార్హం.

ఆఖరిరోజు-మూడోనాడు-ఒక జాతీయ సదస్సు జరిగింది. భారతదేశంలో స్వాతంత్ర్యానంతరం వెల్లడయిన ప్రాంతీయ, భాషా, కుల, రాజకీయ, గుర్తింపులపై (Identities) ప్రముఖ సామాజిక శాస్త్రవేత్తలు, చరిత్రకారులు, పాత్రికేయుల ఉపన్యాసాలు, చర్చలు జరిగాయి. ప్రొఫెసర్ ఇర్ఫాన్ హబీబ్ (అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం), ప్రొఫెసర్ సుమిత్

సర్కార్ (ఢిల్లీ విశ్వవిద్యాలయం), ఆష్ఘర్ ఆలీ ఇంజనీర్ (బొంబాయి), యన్.రామ్ (ఫ్రంట్‌లైన్, మద్రాసు), కనాబిరాన్ (హైదరాబాద్), యిందులో పాల్గొన్నారు. ఉదయం పది గంటల నుండి సాయంత్రం ఆరుదాకా జరిగిన యీ సదస్సు, క్రిక్కిరిసిన శ్రోతలతో జయప్రదమైంది.

## సాంస్కృతిక ప్రదర్శనలు

మహాసభల అధ్యయన చర్చలు ఒకవైపు కొనసాగుతూవుంటే, సాయంత్రాల్లో ఏర్పాటుచేసిన సాంస్కృతిక ప్రదర్శనలు ఆంధ్ర దేశపు ప్రజాకళారూపాలు ప్రేక్షకులను అలరించాయి. విశ్వవిద్యాలయ ప్రాంగణంలో నివసిస్తున్న ప్రజలు, అధ్యాపక, విద్యార్థులతో పాటు గణనీయసంఖ్యలో వీటిని తిలకించారు. అల్లూరి సీతారామరాజుపై నాజర్ శిష్య బృందం(రామచంద్ర పురం, కృష్ణ బృందం) చెప్పిన బుర్రకథ, నిజామాబాద్ జిల్లా నుండి వచ్చిన చిందు భాగవతం, కృష్ణాజిల్లా డప్పు నృత్యం, గజల్స్ ఆలాపనలు, ఈలపాట కచ్చేరీ సభారంజకంగా వున్నాయి. గవర్నర్ సతీమణి డాక్టర్ హరిప్రియ రంగరాజన్ యీ ఉత్సవాలను ప్రారంభించి, ప్రతిరోజు ఆమె ఈ కార్యక్రమాలలో పాల్గొన్నారు.

చరిత్ర మహాసభల్లో జరిగిన ప్రతినిధుల సమావేశంలో, సమర్పించిన పత్రాల గూర్చి కుదింపు జరిగింది. కొన్ని ముఖ్యమైన తీర్మానాల గురించి యిక్కడ ప్రస్తావించడం అవసరం.

గత దశాబ్దంగా, హిస్టరీ కాంగ్రెస్, ఆంధ్రప్రదేశ్ చరిత్ర సమగ్ర రచన గూర్చి తీర్మానాలు చేస్తూ వస్తున్నది. దాదాపు ఇరవయ్యేళ్ళకు పైబడి అనేక సంస్థలు- ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్శిటీ, తెలుగు అకాడమీ, అంతర్జాతీయ తెలుగు సంస్థ, స్టేట్ ఆర్కైవ్స్- యీ రచనా భారాన్ని వహించడాన్కి ప్రయత్నాలు చేశాయి. కానీ అవి కార్యరూపం దాల్చలేదు. దీనిక్కారణం దీక్ష, పట్టుదల లేకపోవడం అన్నిటికి మించి, మన రాష్ట్రానికి ఒక సమగ్ర చరిత్ర కావాలన్న తపన లోపించుట పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్రలే కాక, కేరళ, పశ్చిమ బెంగాల్, పంజాబ్ లాంటి అనేక యితర రాష్ట్రాలు యీ దిశలో కృషి చేసి సమగ్ర చరిత్రలను రూపొందిచుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడ, హిస్టరీ కాంగ్రెస్ అభ్యర్థనలను, తీర్మానాలను పట్టించుకోలేదు. ఇది ఒక జాతి సంస్కృతికి సంబంధించిన అతిముఖ్య విషయం. ఈసారి హిస్టరీ కాంగ్రెస్ ఎగ్జిక్యూటివ్ యీ అంశాన్ని కూలంకషంగా చర్చించి. ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేసింది. తానే యీ బాధ్యతను చేపట్టాలని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూనే, మరొకవైపు కృషి ప్రారంభించాలని నిర్ణయించింది. ఇదొక చారిత్రాత్మక, సంచలన నిర్ణయం, కావల్సిన. మేధోపరమైన అధ్యయన సంబంధితమైన శక్తి తనకున్నది, ఇక ఆర్థికంగా వనరులను సమకూర్చుకోవాలి. అది కష్టంతో కూడిన పనియైనా, అసాధ్యం కాదు. ఒక సబ్ కమిటీని నియమించి, ఈ బృహత్తర పథకానికి కావల్సిన ముసాయిదా నివేదికను తయారుచేయమని

ఆదేశించింది. ఇప్పటికే యిటు రాష్ట్రంలోనూ, అటు వెలుపలా, విదేశీ విశ్వవిద్యాలయాల్లో ఆంధ్రప్రదేశ్‌పై పరిశోధన సాగిస్తున్న అనుభవపరులైన చరిత్రకారులున్నారు. వారితోసంప్రదించి, ఎన్ని సంపుటాలుగా మొత్తం చరిత్రను - చరిత్ర పూర్వంగం నుండి, ఆధునిక యుగంలోని వర్తమాన కాలం ధాకా-విభజించాలి. దీనిలోని వివిధాంశాలను, చర్చించి, నిర్ధారించి, ఒక్కొక్క సంపుటానికి ఒక సంపాదకుడు దానిలోని విషయ రచనకు ఎంపిక చేసుకోవాల్సిన వస్తువుల గూర్చి, దీనికయ్యే వ్యయభారాన్ని నిర్ణయించుకొని, త్వరలోనే ఒక నిర్దుష్ట ప్రణాళిక తయారు చేసుకుని, పనికివుపక్రమించాలని, జనరల్ బాడీ సమావేశంకూడా ఏకగ్రీవంగా తీర్మానించడం ముదావహం.

## చరిత్ర పుస్తకాల సమీక్ష

ఇతరత్రా అంశాలను గూర్చిన తీర్మానాల్లో, చెప్పుకోదగ్గది, మన రాష్ట్రంలోని ప్రాథమిక, సెకండరీ కళాశాల స్థాయిలో వున్న చరిత్ర పాఠ్యపుస్తకాల గురించి. జాతీయ కమిటీ నేతృత్వంలో ఆంధ్రప్రదేశ్‌లోని స్కూల్ పాఠ్యపుస్తకాల సమీక్ష జరిగింది. వారు తయారు చేసిన నివేదికతో పాటు, హిస్టరీ కాంగ్రెస్ సభ్యులు కూడా యీ పాఠ్య గ్రంథాలను పరిశీలించారు. వీటిని గమనించినపుడు, చారిత్రకవాస్తవాలను తారుమారు చేయడమే కాకుండా, గ్రంథకర్తలు అవలంబించిన పద్ధతి, వుపయోగించిన భావజాలం, చరిత్రను వక్రీకరించేలావుంది. వలసవాద సంకెళ్ళ నుండి బయటపడి, స్వతంత్ర, సామ్యవాద, ప్రజాస్వామ్య, లౌకిక సమాజాన్ని నిర్మించుకొనే ప్రయత్నంలో వున్న ఒక జాతి, చరిత్ర రచనలో తీసుకోవాల్సిన మెలకువలను గూర్చి తీవ్రంగా పరిగణించాల్సి వుంది. సామాజిక భావజాలాన్ని వుపయోగించుకుని అధ్యయనాంశాలను, ప్రగతిశీలంగా, తయారుచేసుకొనే వెసులుబాటు ఒక చరిత్రకేవుంది. అందుకని, అది శాస్త్రీయంగానేకాక, లౌకిక భావాలతో కూడి వుండాలి. భారతీయ సమాజ మూలకందమైన, బహుళ సంకీర్ణ సంస్కృతికి చరిత్ర అద్దం పట్టాలి. చిన్నవయసులోనే సరైన, సమతుల్యంతో కూడిన చరిత్ర రచన, బోధనలకు పూనుకోవాలి. ఈదృష్టితో హిస్టరీ కాంగ్రెస్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని తదనుబంధ సంబంధిత సంస్థల్ని యీ విషయం గూర్చి హెచ్చరిస్తూ తీర్మానం చేయడమేగాక, పాఠ్యగ్రంథాల రచన, జాతీయ నివేదికలోని అంశాలను దృష్టిలో పెట్టుకుని సాగించాలని విజ్ఞప్తి చేసింది. పాఠశాల స్థాయిలోనూ, కళాశాల స్థాయిలోను, జిల్లాల వారీగా, చరిత్ర అధ్యాపకులకు ఓరియంటేషన్ కోర్సులను జరిపే కార్యక్రమాన్ని, మరింత పట్టుదలతో కొనసాగించాలని తీర్మానించారు.

ఇరవై రెండవ వార్షిక మహాసభలు, ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ చరిత్రలో ఒక మైలు రాయిగా వుండి పోతాయనడంలో సందేహం లేదు.

# నడమంత్రపు సిరి వర్గాల నాట్య విలాసాలు - క్షీణ సంస్కృతి

[illegible]

సంపద ఉత్పత్తితో సంబంధంలేని (Non Productive) శ్రామికులున్నట్లే సంపద ఉత్పత్తితో సంబంధంలేని సంపన్నవర్గాలు లేదా దళారీ వర్గాలు కూడా సమాజంలో వున్నాయి. రికామికీగా వుండే ఈ శ్రామికులను Lumpen Proletariat అని మార్క్సిస్టు పరిభాషలో పిలవడం కద్దు. ఆ లెక్కన ఉత్పత్తితో సంబంధంలేని అక్రమ, అన్యాయ సంపాదనల ద్వారా అమాంతం సంపన్నవర్గాలుగా తయారైన వారిని ఏమని పిలవాలి? వీరిని నడమంత్రపుసిరి వర్గాలు Lumpin Bourgeoise అని పిలవాలి.

50 సంవత్సరాల స్వతంత్ర భారతదేశంలో పాలకవర్గం తప్పుడు విధానాల వలన ఈ నడమంత్రపుసిరి వర్గాలు పెచ్చుపెరిగాయి. అడ్డగోలుగా, నీతి, నియమాలు లేకుండా డబ్బు సంపాదించడం, అంతులేని ఆర్భాటాలు, అట్టహాసాలతో విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టడం వీరి సంస్కృతి.

లోక్‌సభ మధ్యంతర ఎన్నికల పుణ్యమా అని ఈ నడమంత్రపు సిరి వర్గాల నాట్య విలాసాల గురించి"హిందూ" పత్రికవంటి ఉదారవాద ధనికవర్గ పత్రిక కూడా విమర్శనాత్మక సమాచారం సంపాదించి ప్రకటించింది. 1998 జనవరి 4వ తేదీ, 11వ తేదీల ఆదివారం అనుబంధాల్లో "Lumpen Values, Lumpen elite" అనుపేర, "Caught in a Bind" అనుపేర రచయితలు శ్రీ రవి వ్యాస్, శ్రీ దేవశ్రీ బెనర్జీ, శ్రీ గౌతమఘోష్, శ్రీ కె.వి.ఎస్. మహదేవులు విలువైన సమాచారం అందించారు. నేటి భారతదేశంలో ఉన్నత సంపన్నవర్గాలని పిలువబడే ఈ వర్గాలలో ఎటువంటి సమాజిక విలువలు, బాధ్యతలు లేని, సమాజాన్ని దోపిడీచేయడమే ప్రధాన నీతిగా కల, వర్గాలు

**ఎలా స్వైరవిహారం చేస్తున్నాయో, అట్టడుగున పడివుండే పేదప్రజానీకం, మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి వర్గాలు ఎటువంటి దుర్భర జీవితాలు అనుభవిస్తున్నారో తెలిపారు. ఈ సమాచారం ఆధారంగా ఈ వ్యాసం రచించబడింది.**

స్పానిష్ తత్వవేత్త, విమర్శకుడు జోస్ ఓర్టెగా గాసెట్ 1930లో "అట్టడుగునున్న అలగాజనం (శ్రామికవర్గం) తిరుగుబాటు" అనే పుస్తకం వ్రాశాడు. 1917లో రష్యాలో జరిగిన అక్టోబరు విప్లవం, ఆ తరువాత యూరప్‌లో తలెత్తిన ఫాసిజం, నాజీజం నీలినీడల నేపథ్యంలో ఈ అట్టడుగు ప్రజానీకాన్నే (శ్రామికవర్గాన్ని) అలగాజనంగా బహుశా ఆయన చిత్రించారు. కాని ఆ తరువాత నడమంత్రపుసిరి వర్గాల నాట్యం, వారి విలాస విభ్రమాలు తలెత్తుతాయనిగాని అవి సమాజాన్ని భ్రష్టుపట్టిస్తాయనిగాని ఆయన వూహించి వుండడు.

నేడు సమాజంలో మరింత విస్తృతంగా క్షీణ నాగరికత సంస్కృతి తలెత్తింది. కాని ఈనాటి క్షీణ నాగరికత ఓర్టెగా అనుకునే అలగాజనం Lumpen Proletariat వలన కాక సమాజంలో అత్యున్నతస్థానం ఆక్రమించి కూచున్న నడమంత్రపు సిరి వర్గాల నాట్యం వలననే దాపురిస్తూంది. ఈ నడమంత్రపుసిరి వర్గాలే సమాజ సంపదను, సమాచార వ్యవస్థను, ఉన్నత విద్యాకేంద్రాలను, సాంస్కృతిక రంగాన్ని కూడా తమ చేతుల్లో పెట్టుకొని సమాజాన్ని శాసిస్తున్నారు. వీటి ప్రమాణాలను, వీటి స్వరూప స్వభావాలను వారే నిర్ణయిస్తున్నారు. సమాజం అంతకీ వీరే చర్చనీయాంశమవుతున్నారు. సామాజిక సంస్కృతికి వీరు పెట్టిన "వరవడే" ప్రస్తుతానికి చెల్లుబాటు అయిపోతూంది.

ఈ నడమంత్రపుసిరి వర్గాలకు "సామాజిక విలువల" మీద విశ్వాసం ఏనాడో నశించింది. విలువలు అన్న పదానికి వీరి నిర్వచనమే వేరు. విలువలు పాటించవలసినవి కావు. ఏవో అస్పష్టపు భావనలుగా వారు పరిగణిస్తారు. వీరికి హక్కులే గాని అసలు సామాజిక బాధ్యతలు అంటూ ఏమీ వుండవు. ఇక సామాన్య మానవుని పరిస్థితులు ఏమిటి? వారు వున్న అసహాయ స్థితిలో బాధ్యతలు ఏమి నిర్వర్తించగలరు?

## హక్కులేగాని బాధ్యతలు లేని "దోపిడీ వర్గం"

"డామిట్! కథ అడ్డం తిరిగింది" అన్న రీతిగా స్పెయిన్ తత్వవేత్త ఆర్టెగా ఒకప్పుడు "అట్టడుగు ప్రజానీకం ఎప్పుడూ తమ హక్కుల గురించే ఆలోచిస్తారు కాని

బాధ్యతల గురించి ఆలోచించరు" - అని చెప్పింది సరిగా తిరగబడింది. ఇప్పుడు నడమంత్రపుసిరి వర్గాల్లు తమ "హక్కుల" గురించే ఎంతసేపూ పలవరిస్తున్నారు తప్ప "బాధ్యతల" గురించి (సామాజిక బాధ్యతలు) ఏమీ ఆలోచించడంలేదు. మధ్యతరగతి వర్గాలు, అట్టడుగు వర్గాల వారితో పోల్చితే ఈ సంపన్నవర్గాల ధోరణి ఎంతసేపూ "తనకాయుష్యం-తనకారోగ్యం" "చిన్ని నాబొజ్జకు శ్రీరామరక్ష" అనే ధోరణిలోనే, అంటే ఒకరకంగా ఏ సామాజిక బాధ్యత వహించకుండా అన్నీ అనుభవించేయాలన్న ధోరణిలో ఉన్నారు. అడ్డు అదుపు లేకుండా అవకాశాలన్నింటినీ తామే స్వాహా చేయాలన్న ధోరణిలో వున్నారు. తమకు ఎటువంటి హద్దులు వుండరాదనీ, అన్ని విషయాలలో తమకు సంపూర్ణ స్వేచ్ఛ వుండాలని కోరుతున్నారు.

ఎప్పుడూ పైకి ఎగబ్రాకాలన్నదే వారి ఆలోచన. ఊర్ధ్వచలనం వారి నిత్య ఆకాంక్ష. దొర్కిందల్లా దొరకబుచ్చుకోవడమే వారి లక్ష్యం. అదే వారి నీతి. సమాజంలో ఆర్థిక-హెచ్చుతగ్గులు పోవాలన్న భావం వీరికి ఏకోశానా వుండదు. ధనికులు-పేదలు అన్న విభజన "రెండువర్గాల సమాజం" అలాగే శాశ్వతంగా వుండాలన్నది వీరి ఉద్దేశ్యం. కొద్దిమంది గుత్తాధిపతులకు, బడాసంపన్నవర్గాలకే సమాజంలోని అన్ని అవకాశాలూ. విద్య, అధికారం అంతా కేంద్రీకృతమై వుండాలన్నది వీరి కోర్కె. డబ్బుతో కొనగల్గినవన్నీ వీరు కొనుక్కోగలరు. కొనివేయగలమన్నది వీరి భరోసా.

ఇక సమాజంలో శ్రామిక ప్రజలు, పేద, మధ్య తరగతివారి పరిస్థితులు ఏమిటి? వీరు లేమితో బాధపడక తప్పదని అనుకుంటున్నారు. తమకు పేదరికం రాసిపెట్టి వున్నదని, తమ వినిమయశక్తి పరిమితులు అలాగే వుండక తప్పదని అనుకుంటారు.

## అన్ని రంగాల్లో ఆధిపత్యం

ఈ నడమంత్రపుసిరి వర్గాలకు ఈ అపార సంపదలు ఎలా వచ్చిపడ్డాయి? అంతులేని ధనరాసులతోపాటు ఈ సంపన్నవర్గాలు రాజ్యాధికార స్థానాలు కూడా ఆక్రమించి కూచున్నారు. ఆర్థికరంగంలో, ప్రభుత్వ యంత్రాంగంలో, కళలు, సాంస్కృతిక రంగాలలో సైతం వీరిదే ఆధిపత్యం. అన్నిరకాల యాజమాన్యాలలో వీరిదే అధికారం, పెత్తనం. కొద్దిమంది చేతుల్లోనే ఈ అన్ని రంగాలలో ఆధిపత్యం కేంద్రీకృతమై వుంటోంది. ఒకసారి వీరి చేతుల్లోకి ఈ పెత్తందారీతనం వచ్చిందంటే అది మరొకరికి దక్కడం అసాధ్యం.

కొత్తగా దేశంలో తలెత్తిన వృత్తిదారుల, (Professionals) మేనేజర్ల వర్గానికి గుండెకాయ ఎవరయ్యా అంటే సంపన్న తరగతి, ఉన్నత మధ్యతరగతి అనబడే




**ఒక కాలు విమానంలో! ఒక కాలు కారులో!**
**వారు నేలమీద నడవరు!!**

**4-1-98 "హిందూ" సౌజన్యంతో**

నడమంత్రపుసిరి వర్గాలే. ఇది దేశంలో పుట్టుకొచ్చిన కొత్త సామాజిక వర్గం. వీరి పెట్టుబడులు దేశంలోని అన్నిరంగాలకు విస్తరించాయి. విద్యారంగంలో వీరి ధనరాశులు ప్రవేశించాయి. సమాచారరంగంలో వచ్చి ప్రవేశించాయి. పెట్టుబడుల రంగంలో సరేసరి. ఇండ్లస్థలాలు, తదితర స్థిర, చరాస్థులలో ఇక చెప్పనే అక్కరలేదు. ఇదివరకు సంప్రదాయసిద్ధంగా వుండే కుబేరులతోపాటు పాత సంపన్న మధ్యతరగతి వర్గాలతోపాటు వారికంటే మిన్నగా ఈ కొత్త సంపన్నవర్గాలు (వారినే నడమంత్రపుసిరి వర్గాలని

అంటున్నారు) తమ కబంధహస్తాలు చా చి సమాజ సంపదలన్నిటిని సమస్త జీవనరంగాలను హస్తగతం చేసుకుంటున్నారు. వీరి స్వరూపస్వభావాలు ఎలా వర్ణించవచ్చును? డబ్బు స్వాహా తత్వం బట్టికాదు. వీరి వినిమయ పద్ధతులను బట్టి వీరి లక్షణాలను గుర్తించవచ్చు. (by its Consumption styles - Glamorus, gaudy, often indecently lavish) కొత్త కొత్త వస్తువులు మార్కెట్లోకి ఏవి వచ్చినా వీరి గృహాలలో వుండవలసిందే. వారి విలాసాలకు, విరగబాటుకు, పటాటోపానికి, దుబారా ఖర్చులకు అంతువుండదు. వీరి విరగబాటుతనం, ఆడంబరాలు, అట్టహాసాలు, మంచినీళ్ల ప్రాయంగా డబ్బు ఖర్చుపెట్టే పద్ధతులు, భోగలాలసత్వం-పట్టపగ్గాలు లేకుండా ప్రదర్శించే వీరి ఫ్యాషన్లు, "సరిరారు మాకెవ్వరూ!" అనే పైలా పచ్చీసు ధోరణి, వీటిని బట్టే నడమంత్రపుసిరి వర్గాలను గుర్తించవచ్చు. పెళ్లిళ్లకు, విందులకు, వినోదాలకు డబ్బు విచ్చలవిడిగా-విరజిమ్మడం వీరి లక్షణం. భగవంతుడు సర్వాంతర్యామి అవునో కాదోగాని వీరు ప్రత్యక్షంకాని చోటులేదు. వీరే స్కామ్ బ్రోకర్లు, వీరే రియల్ఎస్టేట్ (యిళ్లస్థలాల) ప్రమోటర్లు, వీరే బహుళ అంతస్తుల గృహనిర్మాతలు, వీరే ఇంజనీర్లు, వీరే అన్నిరకాల కన్సల్టెంట్లు, వీరే కంప్యూటర్ సైంటిస్టులు, వీరే డాక్టర్లు, వీరే లాయర్లు, వీరే కంపెనీ ఎగ్జిక్యూటివ్‌లు, వీరే సినిమా ప్రొడ్యూసర్లు, టెలివిజన్ ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు ఇలా నేడు వీరు ఆధిపత్యం వహించని రంగం అంటూ లేదు.

## రెండు ప్రధాన లక్షణాలు

ఈ నడమంత్రపుసిరి వర్గాలకు రెండు ప్రధాన లక్షణాలున్నాయి. ఒకటి:- వీరి సంపద, సమాజ సంపదను ఉత్పత్తి చేయడం ద్వారా (Not by Manufacturing) సంపాదించిందికాదు. వివిధరంగాలలో తదేక కృషితో కష్టపడి ఉత్పత్తి పెంపుదలచేయడం వలన వచ్చింది కాదు. ఉత్పత్తితో సంబంధంలేని దళారీ తనాలవలన వచ్చింది (కాంట్రాక్టర్లు, స్టాక్ బ్రోకర్లు, హోటళ్ళు, సినిమాలు వగైరా వగైరా) సమాచారరంగం, సర్వీసులరంగం మొదలైనవి.

రెండవలక్షణం:- వీరికి ఒక ఉమ్మడి రాజకీయ దృక్పధం అంటూ వుండదు. ఒకరకంగా చెప్పాలంటే వీరికి అసలు ఏ రాజకీయాలు అక్కరలేదు. పైసా ఎలాగైనా సరే కూడబెట్టడం, ఏ యెండ కా గొడుగు పట్టి తమ పబ్బం నెరవేర్చుకోవడమే వీరి రాజకీయం. వీరి ఫిలాసఫీ!

## అడ్డగోలు సంపాదనలు

ఈ నడమంత్రపుసిరి వర్గాలు అడ్డగోలుగా సంపాదించడానికి అవలంబించే మార్గాలు, ప్రధానంగా లావాదేవీల మార్గాలే. గూడుపుఠాణీ మార్గాలే. (Net Working)

దగా, మోసం, నమ్మకద్రోహం, అంతులెని పోటీలు, ఎదుటివాడికి గోతులుతీయడం, వెన్నుపోటు పొడవడం. ఏ పద్ధతి అనుసరించి అయినా ఏ అక్రమమార్గాన అయినా సరే డబ్బు సంపాదించడమే. అదే నీతి, అదే రాజకీయం, అదే మతం, అక్రమ సంపద, అన్యాయార్జితం కోసం ఎలాంటి దుష్టులు, దుర్మార్గులు, స్వార్ధపరులు, అవినీతి పుట్టలనైనా సరే అంటకాగడం, సంఘవ్యతిరేక శక్తులను, స్వార్ధపరవర్గాలను విందులు, వినోదాలపేర కూడగట్టడం, లోబరచుకోవడం ఇరుపక్షాల నుండి ముడుపులు స్వీకరించడం, క్లబ్‌ల పేరిట ఒకచోట చేరి అందులేని బాతాఖానీల ద్వారా ఎదుటివాడి లోగుట్టు కూపీలు లాగడం, దొంగలూ దొంగలూ వూళ్లు పంచుకున్నట్లు వ్యాపారరంగంలో ప్రాంతాలు, ప్రదేశాలు కేటాయించుకోవడం, సమాచార మార్పిడి (నెట్‌వర్క్) ఇవి చాలా ముఖ్యమైన వీరి వ్యాపార లావాదేవీల విధానాలు. సమాజ సంక్షేమం, దేశభక్తి సత్సంప్రదాయాలు వీరికి అర్థంలేని మాటలు. అవివేకుల, అసమర్దుల ప్రలాపాలు, ఒకతరం నుండి మరొక తరానికి అందజేసే కనీస నీతి, నిజాయితీల లాంటివి వీరికి అసలే అక్కరలేదు. "స్వాహా" "స్వాహా" ' తప్ప స్వార్ధరహితసేవ మొదలైన మాటలు కర్ణకఠోరాలు.

"తామే భువి కధినాదులమ"నే విరగబాటు, అన్నింటా తామే తెలివితేటలు, సమర్ధత, కలవారమనే అహంభావం, నిలువెల్లా గర్వం, అతిశయం వీరిలో కొట్టవచ్చినట్లు కనపడతాయి. చదువుతో పాటు సంస్కారం, సంపదతో పాటు వినయం, సౌశీల్యం మున్నగు మానవ నాగరికతా లక్షణాలకు వీరికి సగమెరుక.

అంతేకాదు తాము నిత్యయవ్వనుల్లా కనబడాలనే తపన, తాపత్రయం వారికి మెండు. వచ్చిన కొత్త ఫ్యాషన్లన్నీ వీరి సొమ్ము. నిత్య యవ్వనానికి లక్షణం, నిత్యనూతన ఫ్యాషన్ల వలపులాట, వెంపర్లాట, ప్రదర్శనం. (Show)

నడమంత్రపుసిరి వర్గాల నాట్యం విలాస విభ్రమాలు యిప్పుడు దేశీయ మార్కెట్ అవధులు దాటి అంతర్జాతీయ మార్కెట్‌లోకి, బహుళజాతి సంస్థల బాంధవ్యంలోకి ఎదిగిపోతున్నాయి. చిటికలో వారికి అపార సంపదలు వచ్చిపడిపోవడం ఈ బహుళజాతి సంస్థల బాంధవ్యంవల్లనే. ఈ బాంధవ్యాలకు జాతీయ సరిహద్దులు, ఎల్లలులేవు. ఇదివరకు వలె ఏదోఒక వ్యాపార సంస్థకు, ఒక పారిశ్రామిక సంస్థకు కట్టుబడి వుండనవసరం లేదు, వుండకూడదు. అటువంటి సంస్థాగత విధేయతలు, ప్రాంతాల విధేయత, అభిమానాలకు కాలం చెల్లిపోయింది. దేశాభిమానం అన్నది వీళ్లకు అసలేలేదు. వీరికి అమెరికా, యూరప్‌ల పాశ్చాత్య సంస్కృతి "జబ్బు" పట్టుకొంది. భారతదేశ సంస్కృతికి ఏనాడో వీరు తిలోదకాలిచ్చారు. ప్రాపంచీకరణ ఆర్థిక సంస్కృతి అంటని భారతదేశంలోని సామాన్యప్రజల సంస్కృతికి వీరికి సగమెరుక. అదంటే వీరికి వెగటు!

## "జన్మభూమి" అన్నభావన శూన్యం

జాతీయ సరిహద్దులులేని గ్లోబల్ ఆర్థిక విధానంలో-డబ్బు అన్నదానికి-జాతీయతకు లింకులు తెగిపోయాయి. ధనానికి, జనాభా కదలికలకు యిప్పుడు జాతీయ సరిహద్దులు అంటూ లేవు. స్వస్థలం (జన్మభూమి) అన్నపదానికి కాలదోషం పట్టింది. ఎక్కడ డబ్బు సంపాదనకు అనువుగా వుంటే అదే స్వస్థలం. అదే జన్మభూమి స్వంత పట్టణం. (డేవిడ్ రెయిఫ్ ఉవాచ)స్వదేశీయులతో సంబంధబాంధవ్యాలకంటే వివిధ దేశాలలో వున్న తమ నడమంత్రపుసిరి వర్గాలతోనే (వర్గ సంబంధం) వీరికి బాంధవ్యం హెచ్చు.

ఒక డాక్టరు లేదా ఒక ఇంజనీయరు, లేదా ఒక వాస్తుశిల్పి భారతీయుడు అయినంతమాత్రాన అట్టివారికి సోదర భారతీయులతో సంబంధబాంధవ్యాలు హెచ్చు అనుకుంటే అది పొరపాటే, కపటనాటకమే. ఈ మహానుభావులకు తాము ఏ దేశంలో, ఏ ప్రాంతంలో వుంటే అక్కడ వున్న తన తోటి వృత్తిదారులతోనే ప్రమేయం, భాందవ్యం ఎక్కువ. సల్మాన్ రష్డీ చెప్పినట్లు రచయితలను, కవులను పాస్‌పోర్టు హద్దులతో బంధించడం మూర్ఖం అని చెప్పబడుతున్నది. కదా!

## మారుతున్న వర్గ పొందిక

నేటి భారతదేశ సామాజిక వ్యవస్థలో మారుతున్న వర్గపొందిక; నూతన నడమంత్రపుసిరి వర్గానికి నిస్సహాయస్థితిలో అణగి మణిగి పడివుండే సామాన్య ప్రజానీకానికి మధ్య పెరుగుతున్న అగడ్త, నేడు జరుగుతున్న సామాజిక విభజనలో ప్రతిబింబిస్తున్నాయి. దేశంలో మరింతగా పెరుగుతున్న అసమానతలలో ప్రతిబింబిస్తున్నాయి. దేశంలో జనాభా పెరుగుదలతోపాటు, వ్యవసాయరంగంలో వాణిజ్యసంబంధాల పెరుగుదల యాంత్రీకరణ, మున్నగు కారణాలవలన గ్రామీణ పేద ప్రజలు పట్టణాలకు పెద్దయెత్తున వలసపోతున్నారు. పట్టణాలలో, నగరాలలో మురికి గూడెములు పెరిగిపోతున్నాయి. నగరీకరణ హెచ్చుతోంది. ఇందువలన పట్టణాలలో, నగరాలలో పౌరసౌకర్యాలు, మంచినీరు, గృహవసతి, వైద్య, ఆరోగ్య సౌకర్యాలు, పారిశుద్ధ్యం మొదలైన వాటిపై విపరీతమైన వత్తిడి, భారం పెరిగిపోతున్నాయి. ఇవి ఏమూలకు సరిపోవడం లేదు. నగరాలచుట్టూ, పట్టణాలచుట్టూ అనుబంధ పట్టణాలు, (Satellite Town ships) పేటలు, వార్డులు పెరిగిపోతున్నాయి. స్థలంలేక ఆకాశహర్మ్యాలు (బహుళ అంతస్థుల భవనాలు) పెరిగిపోతున్నాయి. పట్టణాలలో, నగరాలలో పేదప్రజలు నివసించే ప్రాంతాలు

పెరిగిపోవడంతో పట్టణాల, నగరాల ఆరోగ్యం, పారిశుధ్యం, మంచినీటివసతి అధ్వాన్నమవుతున్నాయి. ప్రజల జీవితం, ముఖ్యంగా పేదప్రజల జీవితం దుర్భరంగా, దుస్సహంగా, నరకప్రాయంగా తయారవుతోంది. వీరిలో నిరాశా, నిస్పృహలు, అసంతృప్తి రోజురోజుకి పెరిగిపోతున్నాయి. మురికిగూడెముల్లో కాలిబాటలపై పుట్టి, పెరిగి, మరణించే ఇటువంటి దరిద్రనారాయణుల బాధలేకాక, మధ్యతరగతి ప్రజల జీవితాలు కూడా రోజు రోజుకీ దుర్భరంగా దిగజారిపోతున్నాయి. కొద్దిసంవత్సరాల క్రితం ఎన్నడూ వూహించలేనంత ఘోరంగా, దారుణంగా మధ్యతరగతి ప్రజల జీవితాలు తయారవుతున్నాయి. వారి జీవన ప్రమాణాలు రోజురోజుకీ పడిపోతున్నాయి.

## వైరుధ్యాలతో కూడిన అభివృద్ధి

దేశంలో ఇటువంటి చాలా విపరీతమైన వింత దృశ్యాలు కనబడతాయి. ఒకవైపున మార్కెట్, ఆర్థికవిధానం, (వినిమయ మనస్తత్వం, ఆధునిక ఎలక్ట్రానిక్ పరికరాలు, గృహోపకరణాల మార్కెట్ విస్తరణ) మరోవైపున కొనుగోలు శక్తిలేని అసంఖ్యాక సామాన్య ప్రజానీకం; కొనుగోలుశక్తి పెరగకపోగా తరిగిపోతున్న అసంఖ్యాక మధ్యతరగతి ప్రజానీకం; ఒకవైపు పెట్టుబడి పెరుగుతోంది. మరోవైపు కార్మికులసంఖ్య పెరుగుతోంది. ఒకవైపు ఆహారపదార్థాల ఉత్పత్తి పెరుగుతోంది. కాని మరోవైపు ఆహారపదార్థాల కొనుగోలు శక్తి తరుగుతోంది. ఒకవైపు వినోదం. విలాసాలు పెరుగుతున్నాయి. మరోవైపు ప్రజల ఆవేదన, అసంతృప్తి, నిరాశా, నిస్పృహలు సమాజంలో హింస పెరుగుతున్నాయి. మార్కెట్ శక్తులకు ఒకవైపు రాష్ట్రాల హద్దులు లేవు. కాని మరోవైపు మాత్రం కుల, మత, ప్రాంతీయ విద్వేషాలు, దురభిమానాలు పెరుగుతున్నాయి. పెంచుతున్నారు. రెచ్చగొడుతున్నారు.

## బలహీన పడుతున్న రాజ్యాంగ వ్యవస్థ

సమాజంలో విద్వేషాలు, సంక్షోభాలు పెరిగిపోతూండటంవలన రాజ్యాంగ వ్యవస్థ బలహీనపడిపోతోంది. దెబ్బతినిపోతోంది. అందువలన కూడా ఈ అవాంఛనీయ సామాజిక సంక్షోభాలు అరాచకశక్తులు మరింత పెరిగిపోతున్నాయి. ఇందువలన దేశ సమైక్యత, సమగ్రతలకు తీరని హాని కలుగుతోంది. సమైక్యతకు బదులు సంఘర్షణలు, చీలికలు హెచ్చుతున్నాయి. దేశం ముక్కముక్కలైపోయే ప్రమాదం ఏర్పడుతోంది.

మనరాజ్యాంగ వ్యవస్థ, మనప్రభుత్వాలు శాంతి భద్రతలు కాపాడలేకపోతున్నాయి. అదే సమయంలో ప్రపంచీకరణను దేశస్వావలంబనను దెబ్బకొట్టే బహుళజాతి కంపెనీలు విజృంభించుతున్నాయి. స్వైరవిహారం చేస్తున్నాయి. ఈ

దోపిడీని ప్రభుత్వాలు అరికట్టలేకపోతున్నాయి.

జాతీయభావం, జాతీయాభిమానం అడుగంటిపోతున్నాయి. ఒకవైపున జాతీయభావాన్ని, ప్రాంతీయతత్వాలు. భాషాతత్వాలు, విద్వేషాలు దెబ్బగొడుతుంటే మరోవైపున ఈ ప్రపంచీకరణ శక్తులు కూడా అన్నింటిని "అంతర్జాతీయకరణ" చేయాలంటున్నారు. జాతీయభావాన్ని జాతీయాభిమానాన్ని దెబ్బతీసున్నారు. ప్రపంచీకరణ పేరుతో ఫాస్ట్‌ఫుడ్స్, మనవంట యిళ్లలోకి అప్పుడే చొరబడుతున్నాయి.

అన్ని విలువలు అధోగతిపాలవుతున్నాయి. డబ్బు విలువలు పెరిగి సామాజిక విలువలు దెబ్బతినిపోతున్నాయి. దేశాభిమానం అడుగంటిపోతోంది. "పైసాయే పరమాత్మ' ' అన్నట్లు-- డబ్బే నేడు "అంతర్జాతీయ పరిభాష" అయిపోతోంది. ఈ "అంతర్జాతీయ డబ్బు భాష" ముందు (International Language of "money") మాతృ భాషలు, ప్రాంతీయభాషలు అభిమానాలు వెలాతెలా పోతున్నాయి. స్థానిక భాషలు, ప్రాంతీయ భాషలు వినియోగంలో ఉంటేనే కదా. తమ తమ ప్రాంతాలమీద అభిమానం అనేది వుండటం!

## విజాతీయ ధోరణులు

దేశాభిమానం అనేది వుంటేగదా ప్రజలు త్యాగాలు చేయడానికి ముందుకు వచ్చేది! మనది ఈదేశం అన్న భావన లేకపోతే మనతోటి ప్రజల పట్ల ఆదరాభిమానాలు అనేవి జనించవు. ఒక ఉమ్మడి చరిత్ర, ఒక ఉమ్మడి సంస్కృతి, ఒక ఉమ్మడి భవితవ్య భావన వుంటేనే కదా తోటివారి గురించి మనం ఆలోచించేది?

జాతీయత, జాతీయభావం, జాతీయాభిమానం అనేవి లోపించినప్పుడు (విజాతీయ ధోరణి ఏర్పడినప్పుడు) ముఖ్యంగా వ్యాపారరంగంలో యిటువంటి విజాతీయత ఏర్పడినప్పుడు ఒకరకమైన "సర్వం జగన్నాధతత్వం" (Darker Side of Cosmopolitanism; Cosmopolitanism of the favoured Few) ఏర్పడినప్పుడు తాము "ప్రపంచ పౌరులమనే" భావం ఏర్పడుతుంది. అయితే అందులో వచ్చిన చిక్కు ఏమంటే ఈ "ప్రపంచపౌరులు" - తమ తమ దేశాలలో పౌరులుగా వుంటూనే ఆ దేశపౌరులుగా తమ బాధ్యతలు ఏమీ నిర్వర్తించాలని అనుకోరు. అటువంటి పౌరబాధ్యతలు, అటువంటి జాతీయ బాధ్యతలు తాము నిర్వర్తించవలసి వుంటుందని అనుకోరు. తాము వారిని మించిన గొప్పవాళ్ళం అనుకుంటారు. ఒకరకమైన అహంభావ పూరితులవుతారు. సంకుచితభావాలు కల్గివుంటారు. దేశంలో పౌరసౌకర్యాలు, ఇతర సేవాకార్యక్రమాలకు డబ్బు వెచ్చించడానికి బదులు గిరిగీసుకొని తమ కుటుంబాలు, తమ బంధువులు,

తమవర్గం వారి బాగోగులకు మాత్రమే పరిమితం అవుతుంటారు. ప్రైవేటు పోలీసులు, ప్రైవేటు డిటెక్టివ్‌లు, ప్రైవేటు మందీమార్బలం, ఏర్పాటు చేసుకుంటారు. సమాజం గురించి, దేశంగురించి వీరు ఆలోచించరు. పట్టించుకోరు. దేశ ఖజానాకు తాము. చెల్లించవలసింది చెల్లించరు. అంతా తమ జేబుల్లోకే!

## సామాజిక విలువలు పడిపోవడానికి బాధ్యులెవరు?

ఈనడమంత్రపుసిరి వర్గాలు ఒకవైపున ఇలా సకల భాగ్యభోగాలతో తులతూగుతుంటే, మరోవైపున ప్రభుత్వం దివాళా స్థితిలో పడిపోతూంటే దేశంలోని సామాన్య, మధ్యతరగతి అధోగతి పాలై తీవ్ర సంక్షోభంలో (Crisis Of the Middle class) పడిపోతూంది. 'ధనికవర్గాలకు-పేదవర్గా'లకు మధ్య అంతరం పెరిగిపోతూంది. అందుకే త్వరితగతిని సామాజిక విలువలు తరిగిపోతున్నాయి. మధ్యతరగతి వర్గాలే సామాజిక విలువలకు సహజంగా పట్టుకొమ్మలు. నేడు ఈ మధ్యతరగతి వర్గాలే రోజురోజుకి చితికిపోతున్నాయి. అధోచలనం చెందుతున్నాయి. (DownWard Mobility)దీనికి ప్రధాన కారణం నడమంత్రపుసిరి వర్గాలే. ఏనాటినుంచో వున్న విలువలపట్ల, సత్సంప్రదాయాలపట్ల, మంచీ మర్యాదలపట్ల ఈ నడమంత్రపుసిరి వర్గాలు చూపుతున్న ఉపేక్ష, తిరస్కారధోరణి, ఏవగింపు, బాధ్యతారాహిత్య వైఖరే! ఈ వర్గాలే నేడు సామాజికాభ్యుదయానికి శ్రేయస్సుకు విపత్కరంగా తయారవుతున్నారు.

తమకేదీ అసాధ్యంకాదు. తాము ఏమైనా చేయగలం, తమ డబ్బుతో దేనినైనా కొనివేయగలం అన్నదినడమంత్రపుసిరి వర్గాల భరోసా, ఈ ధీమాయే సామాజిక విలువలు పతనమవడానికి ముఖ్యకారణం.

• (సంపన్న నేరస్థులు-వారి అపరాధాలు అన్న వ్యాసాన్ని 1997 అగస్టు 15 కమ్యూనిజం-సంచికలో మరోసారి పాఠకులు చదవండి.)

× × ×

# ఢిల్లీలో సామాన్య, మధ్యతరగతుల దుర్భర పరిస్థితులు

భారతరాజధాని ఢిల్లీ నగరం అంటే ఎంతగొప్పగా ఉంటుందోననుకునే వారికి తీరా నేడు అక్కడకు వెళ్ళి చూస్తే "పేరు గొప్ప ఊరు దిబ్బ" సామ్యం కనబడుతుంది. రాజపథ్, జనపథ్‌లాంటి మహారాజ వీధులేమోగాని మిగిలిన నగరంలో చూస్తే ఎక్కడికక్కడ

మురికి కూపాలతో నిండిఉండే "నీచ నగర్"గా తయారైపోయిందని చెప్పవచ్చు. తెల్లవారిచూస్తే ఈ మహానగరంలో లంచం ముడుపులు చెల్లించుకోనిదే ఏ పనీ జరగదు.

ఢిల్లీ నగర జీవితం నరకకూపం క్రింద తయారైందని ఒకనాడు ఢిల్లీ సౌభాగ్యం గురించి కలలుకనేవారందరు నేడు విషాదం లో మునిగిపోతున్నారు. నగర జీవితం అధ్వాన్నంగా తయారైంది. రోజురోజుకి కష్టాలు పెరిగిపోతున్నాయి. పౌరుల ఇబ్బందులను ప్రభుత్వమూ పరిష్కరించలేక పోతోంది. ప్రభుత్వేతర స్వచ్ఛంద సంస్థలూ తీర్చలేకపోతున్నాయి. నోరుమూసుకుని ఢిల్లీ నగరంలో బాధలు అనుభవించడంతప్ప వేరే గత్యంతరం కనబడటంలేదు. ఈ బాధలతో జనం సరిపెట్టుకుంటున్నారు. సరిపెట్టుకోవడమేకాదు ఎలాగో ప్రాణాలు ఉగ్గబట్టుకొని తట్టుకుని నిలబడి జీవిస్తున్నారు. ఢిల్లీలో ఎక్కువ మంది లంచగొండితనానికి, దౌర్జన్యాలకు అలవాటు పడిపోయారు. అదొక నిత్య కృత్యమైపోయింది. ఏపనిని చేయాలన్నా ముడుపులు చెల్లించుకోవాలి లేదా అధికార సంస్థానాల్లో ప్రాపకం ఉండాలి.

## కష్టాల కందిరీగల పుట్ట

మీ ఇబ్బందులు ఏమిటి? అని ఎవరినైనా అడగటం తరువాయి కందిరీగల పుట్టకదిపినట్లే. పోలీసుల అత్యాచారాలు, విద్యుచ్ఛక్తి సరఫరా లోపాలు, మంచినీటి కరువు అధ్వాన్నంగా ఉన్న రోడ్లు, వెలగని వీధి దీపాలు, ట్రాఫిక్ జామ్‌లు, దురాక్రమణలు, ప్రభుత్వ వాగ్దాన భంగాలు ఇలా ప్రజల బాధలు చెప్పనలవికాకుండా ఉన్నాయి.

ఢిల్లీ రాజధానిలో పేద నివాస ప్రాంతం కొత్తగా ఏర్పడిన కాలనీ "సంగమ్ విహార్" ఇక్కడ సుమారు 4లక్షల మంది పేదప్రజలు నివశిస్తున్నారు. దారిద్ర్యం కొట్టవచ్చినట్లు యిక్కడ కనబడుతుంది. మానవమాత్రులు నివసించే విధంగా ఈ కాలనీ ఉండదు. మంచినీళ్ళులేక, కరెంటు సప్లైలేక యిక్కడి ప్రజలు పడు బాధ వర్ణనాతీతం. అసలు ఢిల్లీ మొత్తంగానే ఈ రెండు సమస్యలు ప్రజలను పీడిస్తున్నాయనుకోండి, కానీ సంగం విహార్‌లో పరిస్థితి మరింత దారుణం. గత 14సంవత్సరాలుగా ఈ కాలనీలో మంచినీళ్ళు, కరెంటు సప్లై అధ్వాన్నస్థితిలో ఉంది చేతితో కొట్టుకునే నీళ్ళ పంపులు అక్కడక్కడ ఉన్నాయి. వీటితోనే యిక్కడ ప్రజలు నానా అవస్థలు పడతారు. ఇకమురుగు కాల్వల సంగతి చెప్పనక్కరలేదు. కంపుకొడుతూ ఉంటాయి. చెత్తాచెదారంతో రోడ్లు నిండిఉంటాయి. దీనికితోడు మరుగుదొడ్ల సౌకర్యంఉండదు. పారిశుధ్యం పరిస్థితి దారుణం ఇది ఒక రకమైన నరకకూపం అని



మధ్య తరగతి మానవుణ్ణి, వేయిచేతులతో కబళిస్తున్న అవినీతి, లంచగొండితనం సహస్రఫణి! 11-1-98 "హిందూ" సౌజన్యంతో

చెప్పవచ్చు.

"కరెంట్‌సప్లై లేకపోవడంవల్ల బోర్‌వెల్స్ వున్నప్పటికీ నిష్ప్రయోజకరంగా ఉంటాయి." అని ఇక్కడ తీరును సుశీల అనే ఒక మహిళ చెప్పింది. ఒకోసారి మైళ్ళదూరం నడిచి ఇతర కాలనీలకువెళ్ళి మంచినీరు తెచ్చుకోవలసి వస్తున్నదనీ, కరెంటు లేక రాక చాలా అవస్థపడవలసివస్తుందని ఆమె చెప్పింది. ప్రైవేట్ ఎలక్ట్రిసిటీ జనరేటర్లనుండి కరెంట్ తెచ్చుకొనగల్గువారు బోర్‌లనుండిఎలాగో అలాగ నీళ్ళు తెచ్చుకొనగల్గుతున్నారు. మరికొంతమంది అయితే అక్రమ పద్ధతులమీద కరెంటుతీగెల నుండి కరెంటు దొంగతనంగా సంపాదించుకొని నీళ్ళు తెచ్చుకుంటున్నారు.

## నరకప్రాయంగా నగరజీవితం

కరెంటు కనెక్షన్లు, నీళ్ళ కనెక్షన్లు క్రమబద్ధం చేస్తామని ప్రభుత్వం చెప్పేకబుర్లు

గాలిమాటలుగా తయారైనాయి. ఈ కాలనీ వాసుల జీవితం నరక ప్రాయంగా ఉందిఅని సుశీల భర్త రాజు అంటున్నాడు. ఢిల్లీ నగరంలో రాజు ప్రెస్ వర్కర్‌గా పనిచేస్తున్నాడు. కొద్దిపాటి జీతంమీద సంసారాన్ని నెట్టుకొస్తున్నాడు.

దక్షిణ ఢిల్లీలోని మరొక కాలనీలో కహాన్‌పూర్‌లో దేవీ దయాళ్ ఒక టీ స్టాల్ పెట్టుకుని బ్రతుకుతున్నాడు. "నాకు వచ్చే ఆదాయం ఏమూలకు సరిపోవడంలేదు, ఎలా బ్రతకాలో తెలియడంలేదు, ఉల్లిపాయలు కె.జి. 25/- కాలీ ఫ్లవర్ 20/- టొమేటోలు 18/- నాపిల్లలు నేను ఏమితిని బ్రతకాలి? అంటున్నాడు దేవీదయాళ్. పంచదార, కిరసనాయల్ లాంటివి కూడా కొనలేకపోతున్నాం•అని వాపోయాడు, దేవీదయాళ్.

కిరసనాయల్, పంచదార బ్లాక్‌మార్కెట్‌లో కొనుక్కోవలసి వస్తున్నదనీ, తాము ఎంత ప్రాధేయపడినా ఏళ్ళతరబడి రేషన్ కార్డులు యివ్వడంలేదని రేషన్‌కార్డులు యిచ్చే ఇనస్పెక్టర్లు తిప్పి చంపుతున్నారని. లంచం యిస్తేకాని రేషన్ కార్డులు యివ్వడంలేదని రిక్షా కార్మికుడు కుమార్‌అనే అతను చెప్పాడు.

## ముడుపులు చెల్లించనిదే ఏపనీ జరగదు

ఏదైనా సరే! ముడుపు చెల్లించాలి లంచం యివ్వన్దే ఢిల్లీ నగరంలో ఏమీ జరగదు అని పశ్చిమఢిల్లీలోని ఒక పేటలో నివసిస్తున్న యింటి పనిమనిషి లీలావతి చెప్పింది. తాను మూడేళ్ళ క్రితం రేషన్ కార్డు కోసం దరఖాస్తు పెట్టానని, యింతవరకు అతీగతీ లేదని రు.500 లంచం యిస్తే ఇస్తానంటున్నారు. నేను అంత సొమ్ము ఎక్కడ నుండి తేగలను? అని లీలావతి గోడు వెళ్ళబోసుకున్నది. అన్ని ప్రభుత్వ కార్యాలయాలు అల్లాగే ఉన్నాయి. 60పైసలు కడితే యివ్వలసిన రేషన్‌కార్డుకి ఈ ప్రభుత్వ పంపిణీ కార్యాలయం ఉద్యోగులు రు. 500 తేమంటే నాబోటి దాసికి ఎక్కడనుండి అంత డబ్బువస్తుంది? ఎప్పటికైనా లంచం యివ్వకుండానే నా రేషన్ కార్డు సాధిస్తాను. అని లీలావతి పట్టుదలగా మాట్లాడింది.

అడుగడుగునా, ఇలాంటి లంచాలు యివ్వవలసిన పరిస్థితుల్లో ప్రజలు ముఖ్యంగా పేదప్రజానీకం నానా బాధలు పడుతుంటే పోలీసువారు ఏంచేస్తున్నారు? పేద ప్రజానీకం గతి వారు అసలు పట్టించుకోవడంలేదు.

నీరు స్యియాన్ అనే మహిళ భర్త గత సంవత్సరం డిసెంబరు 8వ తేదీన రోడ్డు ప్రమాదం లో మరణించాడు. ఎలాగో తంటాలుపడి మరణ సర్టిఫికెట్ సంపాదించింది. నష్ట పరిహారం గురించి పోలీసులను అడిగితే ముందు లంచం పట్టుకురా తరువాత

చూద్దాం అంటున్నారు నేనేం చేయను? అని నీరు స్యియాన్ బోరుబోరు మని విలపించింది.

## సంక్షోభంలో మధ్యతరగతి వర్గం

ఢిల్లీలో పేద వర్గాల పరిస్థితి యిలా ఉంటే ఇక మధ్యతరగతి ప్రజల పరిస్థితి ఇంతకంటే ఏమీ మెరుగ్గాలేదు. రోజురోజుకీ పెరిగిపోతున్న ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదలతో ప్రభుత్వ రవాణా సదుపాయాలు రోజురోజుకీ అధ్వాన్నమై పోతూండటంతో, యీ సమస్య రానురాను మరింత కష్టసాధ్యమై పోతూండటంతో ప్రభుత్వ కార్యాలయాలకు వెడితే ఏ పని జరగకుండా, తిప్పి చంపుతూంటే, వాళ్ళ దురహంకారం అసమర్థత పెచ్చు పెరిగిపోతోంటే ఢిల్లీలోని మధ్యతరగతుల జీవిత పరిస్థితులు కూడా దుర్భరంగా తయారవుతున్నాయి.

రక్షణ మాజీ ఆఫీసరు ఆర్.ఎస్. భార్గవ, ఢిల్లీ విద్యుచ్ఛక్తి బోర్డు ఉద్యోగుల చేతుల్లో పడుతున్న అవస్థల గురించి చెప్పుకొచ్చాడు. ఆయనకువచ్చే ఎలక్ట్రిసిటీ బిల్లులు వందలలో రావలసివుంది వేలరూపాయలలో వస్తుంటే "ఇదేమిటి మహాప్రభో" అని ఎన్ని మొరలుపెట్టుకున్నా వాటిని సరిద్దిడంలేదట, మీటర్ రీడుంగులు తీసుకోడానికి సరిగా రారట, ఆఖరిగడువుతేదీ ఇంకరెండు మూడురోజలలో ముగుస్తుందనగా బిల్లులు అప్పుడు వస్తాయట, బిల్లు కట్టలేదని కనక్షన్ వూడలాగడానికి మాత్రం తయారవుతారట. విద్యుచ్ఛక్తి బోర్డు ఉద్యోగుల పనితీరు ఇలా ఏడుస్తూంది'' అని శ్రీ భార్గవ మొరలెత్తాడు.

ఎన్నిసార్లు ఫిర్యాదులు చేసినా ఎవ్వరూ పట్టించుకోరు సరికదా "నీదిక్కున్నచోట చెప్పుకో పో'' అంటారు అని మరో పెద్దమనిషి సుధాంశుభూషణ్ మొరలెట్టారు. ఒక ఎడ్వర్‌టైజింగ్ ఏజన్సీలో పనిచేసే సుధాంసుభూషణ్ "నీటి సరఫరా, విదుచ్ఛక్తి సరఫరా అధ్వాన్నస్థితిలో ఉండటంతోపాటు ఈ శాఖ ఉద్యోగులు చూపించే నిర్లక్ష్యం దుస్సహంగా ఉంది. ఈ కరెంటు ఆఫీసుకు వెళితే ఎవరూ వినిపించుకోరు. ఎవరూ మాట్లాడరు సరికదా చీత్కరించుకుంటారు అని అన్నారు.

## అంతు, దరీ లేని లంచగొండితనం

ఇన్‌కమ్ టాక్స్ కాగితాలు సరిచూసే విషయంలోకాని, జాతీయ బ్యాంకుల నుండి ఏదైనా రుణం తెచ్చుకొనే విషయంలో గాని, బిల్లులు ఏదైనా చెల్లించే విషయంలో కాని ప్రభుత్వ కార్యాలయాల్లో అన్ని స్థాయిల్లో కూడా అంతులేని లంచగొండితనం ప్రత్యక్షమౌతుందని మధ్యతరగతి ప్రజానీకం మొరపెడుతున్నారు. బ్యాంకుకు వెళ్ళి లాకర్ యిమ్మని అడిగితే రు. 50వేలు డిపాజిటు బ్యాంకులో వేయండి అప్పుడు లాకర్ విషయం చూద్దాం అంటారట. తూర్పు ఢిల్లీలోని ఒక గృహిణి ఉషామెహతా పై విధంగా

తన గోడు వినిపించింది.

పాస్‌పోర్టుకు దరఖాస్తు పెట్టారనుకోండి 1000/-లు అక్కడ పెడితే అప్పుడు చూద్దాం. అంటారట పోలీసులు సర్టిఫికెట్ యివ్వడానికి. జనన సర్టిఫికెట్ కావాలనుకోండి 500/-లు అక్కడ పెట్టండి తరువాత చూద్దాం అంటారు. ఏదైనా మంచి స్కూలులో పిల్లకు లేదా పిల్లవాడికి సీటు కావాలని వెడితే రు. 20,000 డొనేషన్ కట్టండి అప్పుడు చూద్దాం అంటారట. కాలుష్యం కంట్రోలులో ఉన్నది అన్న సర్టిఫికెట్ పరిశ్రమ యజమానికి కావాలనుకోండి ప్రతినెలా ఈ కాలుష్య నివారణ ఇనస్పెక్టరుకు వేలమీద ముడుపులు చెల్లించాలి.

## ఈ అవినీతి ఎప్పటికైనా పోతుందా?

"ఈ లంచాలు అవినీతి మహాజాడ్యం ఇంతే దీనిని ఎవరూ అరికట్టలేరు. అరికట్టే నాధులుండరు అని ఢిల్లీ నగర వాసులు నోరుమూసుకుని, తలలువంచి బ్రతుకుతున్నారు. ఎప్పటికైనా ఈ మహాజాడ్యనిర్మూలన జరుగుతుందా? అన్నమాట కూడా ఎవరూ అనగలిగే పరిస్థితిలో లేరు.

అయితే ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నరు క్రింద ప్రత్యేక కార్యదర్శిగా ఉన్న పోలీసు ఉన్నతోద్యోగి కిరణ్‌బేడి మాత్రం చాలా ఆశాభావంతో "ఈ అవినీతి త్వరలో అరికట్టబడుతుంది" అని అంటున్నారు.

ప్రజల ఇబ్బందులను గురించిన ఫిర్యాదులు విభాగానికి 1977లో 55,134 వచ్చాయనీ, ఈ విషయంలో ఢిల్లీ గవర్నర్ శ్రద్ధ వహించడంవలన, ఢిల్లీ ప్రభుత్వోద్యోగులలో కొంత బెదురు పుట్టిందనీ ఇది ఆరంభం మాత్రమేనని త్వరలో ఉద్యోగుల చెవి మెలిపెట్టే గట్టి ప్రయత్నం జరుగుతుందని కిరణ్‌బేడి అన్నారు.

× × ×

# మద్రాస్‌లో మధ్యతరగతి దౌర్భాగ్య పరిస్థితులు

"పుట్టింది మొదలు చచ్చేవరకూ జీవితం అంటే కష్టాలకడలి - అందులో సామాన్యమానవుని పరిస్థితి మరింత దౌర్భాగ్యకరమైనది" అని మద్రాసు మహానగరంలో పరిస్థితి చూస్తే ఒప్పుకోక తప్పదు.

రాఘవన్ భార్య పురుడు పోసుకోడానికి మద్రాసులోని పిల్లల ట్రస్టు ఆస్పత్రిలో చేరి నొప్పులు పడుతూంది అలాగే పేదవాడైన అన్వర్ భార్య కూడా నొప్పులు పడుతూంది.

ఇరువురూ ఎంతో ఆందోళనతో బైటవేచి వున్నారు. చంటిగుడ్డు క్షేమంగా బైటపడి కేర్‌కేర్‌మని ఎపుడు ఏడుస్తుందో అని ఎదురుచూస్తున్నారు.

ఈ శిశువులు సురక్షితంగా బైటపడాలి. వారి జననసర్టిఫికెట్‌లు తీసుకోవడంతో ఆ తల్లిదండ్రుల కష్టాలు ప్రారంభమవుతాయి. బర్త్ సర్టిఫికెట్లు తీసుకోవడం కూడా ఈ రోజుల్లో అంత సులువైనదికాదు.

ఇక ఆ తరువాత ఈ బిడ్డలు కొంచెం ఎదిగి ఏ నర్సరీ స్కూళ్ళలోనో చేర్పించవలసి వస్తే డొనేషన్ బెడద మొదలవుతుంది. ఏ పదివేలో ఇరవైవేలో నర్సరీల్లో చేర్పించడానికి కూడా కావాలి. బ్యాంకు లో డబ్బు వేసుకోగల్గే స్తోమత ఉన్నవాళ్ళయితే ఆ ఎకౌంటు ను ఖాళీ చేయాలి.

## పెన్షన్ కోసం పడిగాపులు

రక్షణశాఖలో పనిచేసి రిటైరైన వెంకటేశన్, పెన్షన్ డ్రా చేసుకోడానికి బ్యాంకుకు వెళ్ళాడు. వయస్సు 67యేళ్ళు ఎలాగో కష్టపడి విత్‌డ్రాయల్ చీటి సంపాదించాడు. దాన్ని పూర్తిచేసి గుంపులోంచి తోసుకుంటూ వెళ్ళాడు. అనవసర జాప్యాల పద్ధతి జాతీయం చేసిన బ్యాంకుల్లోను మారలేదు. చివరకు ఎలాగో పెన్షన్ చేతుల్లో పడేసరికి నీరసం వచ్చింది.

ఇక మీకు బ్యాంకు రుణం కావాలా? బాగా ఎరిగి ఉన్నవాళ్ళు స్టాఫ్‌లో ఎవరైనా ఉంటే అటువంటి ప్రయత్నం చేయాలి. లేకపోతే మాట్లాడకుండా వూరుకోవాలి.

మామళ్ళపురం దగ్గర కోవలం గ్రామంలోని మత్స్యకారుడు ఆర్.నారాయణ కు 10వేల బ్యాంకు ఋణంకావాలి. వలలు కొనుక్కోవాలి. తన కాటమరాన్‌కు (చేపలపడవ) కు చిన్న సెకండ్‌హాండ్ మోటారు కొనుక్కోవాలి. నారాయణ ఒక ఫైవ్‌స్టార్ హోటల్లో వాచ్‌మన్‌గా కూడా పనిచేస్తాడు. అయినాసరే బ్యాంకు అధికారులు రుణం యివ్వడానికి నిరాకరించారు.

ఇక జనన సర్టిఫికెట్ కావాలంటే లంచం; స్కూల్‌లో పిల్లలను చేర్పించాలంటే డొనేషన్. ఇలా సామాన్య మధ్యతరగతి మానవుడు పడే అవస్థలు చెప్పనలవికాదు.

ఇక నారాయణ లాంటి వాళ్ళు ఏ సహకార బ్యాంకు లోనో రుణం సాంపాదించాలంటే పెళ్ళాంమెడలో పుస్తెలు తాకట్టు పెట్టాలి. అది సాధ్యంకాకపోతే నగలు, వడ్డీ వ్యాపారుల దగ్గర తాకట్టు పెట్టి డబ్బుతెచ్చుకోవాలి. దానికి నెలనెలా

చచ్చినంత హెచ్చువడ్డీరేటు చెల్లించుకోవాలి. ఇచ్చేరుణం నాల్గయిదు వాయిదాలు ముందే విరగకోసుకుని ఆ వడ్డీవ్యాపారస్థులు డబ్బు యిస్తాడు.

## నివాస గృహం కోసం కలలు

ఇక మద్రాస్‌మహాపట్టణంలో చిన్న నివాస గృహం, చిన్న ఫ్లేట్(అంతస్తుభవనంలో వాటా) కావాలంటే మధ్యతరగతి మానవునికి అసాధ్యమైన విషయం, అలాకలలు కంటూనే ఉండాలి. కిరసనాయలు స్టవ్ బదులు గ్యాస్‌స్టవ్ కొనాలన్నా మామూలు దిగువ మధ్యతరగతివాడికి కష్టసాధ్యమే. ఒకవేళ అతికష్టం మీద గ్యాస్‌స్టవ్ సంపాదించినా ఎప్పటికప్పుడు గ్యాస్ సిలిండర్ కావాలంటే అదనంగా 50/- అదనంగా ముట్టచెబితేగాని రాదు. పోనీ దుకాణంలో కిర్సనాయలు కొందామంటే పదిలీటర్లుకు డబ్బుగుంజి 8 లీటర్లు మాత్రమే పోస్తారు. పుచ్చుకుంటే పుచ్చుకో లేకపోతేలేదు అంటారు. బహిరంగ మార్కెట్లో కొందామంటే లీటర్ రు. 12.50 కు కాని దొరకదు. ఈ బహిరంగ మార్కెట్లో దొరికేది కూడా చౌకధరల దుకాణం నుండే రహస్యంగా బహిరంగ మార్కెట్లోకి వస్తుంది.

గ్యాస్ సిలిండరు ఎందుకు సవ్యంగా రావడంలేదని ఎవరైనా అడిగితే "సప్లై సరిగా లేదండీ! మేము ఏంచేస్తాం!" అని సిలిండర్ సప్లయ్ ఏజెంటు జవాబు. బెంగుళూరు నుండి గ్యాస్ ఫిల్లింగ్ కేంద్రం నుండి మద్రాస్‌కు ఏరోజుకారోజు సిలిండర్ లారీలు వస్తూనే వుంటాయి. కానీ రాలేదు. పొమ్మంటారు. గ్యాస్ సిలిండర్ ఏజెంట్లు, బ్లాక్ మార్కెట్‌లో సిలిండర్లు అమ్ముకుంటున్న సంగతి బహిరంగ రహస్యం.

## అడుగడుక్కు లంచాలే!

టెలిఫోన్ కనెక్షన్ కావాలన్నా కరెంటు కనెక్షన్ కావాలన్నా, అలాగే కుళాయి కనెక్షన్ కావాలన్నా చివరకు ఇంట్లో చెత్తా చెదారం బైటపడేస్తే దానికి కుండీల్లోంచి తీసుకుపోవాలన్నా ఏదీ కూడా ముడుపులు చెల్లించనిదే, ఒకటికి పదిసార్లు తిరగనిదే అందుబాటులోకి రావు. ఫిర్యాదులు ఎవరికి చేయాలి? చేసినా వినేనాధుడు ఎవరు?

వీధిలో వారాలతరబడి చెత్తకుండీలో చెత్తవల్ల కంపుకొడుతూ ఉంటుంది. చెత్త ఎత్తే మునిసపల్ పనివాళ్ళలారీ వచ్చిందనుకోండి ముందు తలుపుకొట్టి డబ్బులు అడుగుతారు మామూలు యివ్వనిదే కదలరు. వదలరు.

ఇక మద్రాసు నగరంలో ఆటోరిక్షాలు మీటరు రేట్లకు ఎవరూరారు. బేరం ఆడుకోవలసిందే. అదనంగా చెల్లించుకోవలసిందే. మీటరు మీటరే ఆటోవాళ్ళు గుంజే

హెచ్చురేటు హెచ్చురేటే. పోలీసులున్నా పట్టించుకోరు ఎవరికి చెప్పినా ఏం లాభంలేదు.

ఇక రైల్వే రిజర్వేషన్ భాగోతం, కంప్యూటర్లు వచ్చిన తరువాత, అయిదు నిమిషాలులోనే పని జరిగిపోయేమాట వాస్తమేగాని సీటులోంచి లేచిన క్లర్క్ అయిదు నిమిషాలు అటుయిటూ వెళ్ళినా క్యూలు పెరిగి పోయి చాలా ఆలస్యం అయితేగాని బైటపడలేము. మధ్యమధ్యలో లేవకపోతే, ఆరుగంటలు ఏకదమ్మున వాళ్ళు మాత్రం ఎలా పనిచేయగలరండీ! అన్నాడొక రైల్వే అధికారి. ఎమర్జెన్సీ కోటాలో టికెట్ సామాన్యుడికి అందుబాటులో లేని విషయం. వి.ఐ.పి. లకే ఆ సౌకర్యమం తప్ప సామాన్యుడి దాకారాదు. ఏ ప్రభుత్వ కార్యాలయాల్లో ఏ పనవ్వాలన్నా ముడుపులు తప్పనిసరి.

## పోలీసుల "దోపిడి"

సుగుణం అనే బ్యాంకు ఉద్యోగి; ఆయన యిల్లు ఈ మధ్య దొంగలు దోచారు. మోటారుసైకిలు, భార్యనగలు, ఎత్తుకుపోయారు వీటిని తిరిగి చేతికి తెచ్చుకోవాలంటే పోలీసులకు ఘనంగా ముట్టచెప్పుకుంటేగాని చేతికి రావు.

ఇక పోలీసులకు పండ్లదుకాణాదార్లుకాని, టీ షాపువాళ్లుకాని ఉచితంగా పళ్ళు, టీలు యిచ్చుకోవాల్సిందే. ఇది సర్వేసర్వత్రా అందరికీ తెలిసిన విషయమే.

'పట్టణాల్లో, నగరాలలో జీవించేవాళ్ళు ఎవరూ తమ జీతాలతో బ్రతుకలేరు.' అన్న సంగతి అందరికీ తెలిసిందే. అందుచేత ఎక్కడ ఎలా దొరికితే అక్కడ అక్రమసంపాదనకు దిగవలసిందే. సామాన్యమానవుడు తనకు ఏ పని కావలసివచ్చినా అందుకే ముడుపులు చెల్లించక తప్పటంలేదు. అంతా లంచాలమయం జీవితం. బ్రతికి వున్నప్పుడు సరే, చచ్చినతర్వాత కూడా ఈ లంచగొండి పిశాచి వదలదు. ఆస్పత్రుల నుండి శవాలను తీసుకుపోవాలంటే అక్కడ ముడుపుచెల్లించక తప్పదు. ఇక పోస్టుమార్టం అయిన తరువాత శవాన్ని తీసుకుపోవాలన్నా కూడా పడిగాపులు పడి చివరకు డబ్బు పడవేస్తేగాని ఆ మృతదేహం కూడా అక్కడ నుండి కదలదు.

శ్మశానంలో సంగతి: శవదహనం దగ్గర కూడా పాడెమీంచి దింపడానికి, చివరకు చితాభస్మం యివ్వడానికికూడా పైసాముడితే గాని పని జరగదు. గోయి త్రవ్వడానికి కూడా అంతేకదా.

అక్రమ సంపాదన అన్నది యిప్పుడు క్రమసంపాదన గా తయారైందని అంటే అతిశయోక్తికాదు. ఈ అవినీతి, అక్రమ సంపాదన "వృత్తి, ప్రవృత్తి," ఎప్పటికి అంతమయ్యేది? ఏమో?

× × ×

# హైద్రాబాద్ నగరంలో
# మధ్యతరగతి విషాదమందహాసం

హైదరాబాద్ నగరం ఒకప్పుడు స్తబ్దుగా ఎటువంటి హడావుడులు లేని, నిలువ నీటి కాసారం వలె ఉండే చిన్న నగరం. నేడు అంతులేని జనసమ్మర్దంతో, క్రిక్కిరిసిన రోడ్లతో ఉరుకులు పరుగులు పెట్టే రాష్ట్ర రాజధాని నగరం అయింది. పట్టణం పెరిగినంతగా పౌర సౌకర్యాలు పెరగలేదు మంచినీటి కొరత ఒక వైపు, రవాణా సదుపాయాలు తగినంతగా లేని దుస్థితి మరొక వైపు, సామాన్యమానవవ్యక్తి జీవితం నానాటికీ దుర్భరమైపోతున్న నగరం. రోడ్లు చాలవు, ఈ మురుకు నీటి పారుదల సౌకర్యాలు చాలవు. మురికి గూడెముల పరిస్థితి రోజురోజుకు విషమంగా తయారవుతూంది.

ఒక రిటైర్ అయిన టీచరు, ఒక ప్రభుత్వ ఉద్యోగి, ఒక ఫ్యాక్టరీ కార్మికుడు, ఒక ఆటో రిక్షా డ్రైవరు, ఒక ప్రైవేటు కంపెనీలో చిన్న ఉద్యోగి- వీరు ఎలా ఈ నగరంలో జీవిస్తున్నారో, వారి బ్రతుకులు ఎలా తెల్లవారుతున్నాయో చూస్తే నేడు నగరంలోని పేద వర్గాలు, పేద మధ్యతరగతి, మధ్యతరగతి వర్గాలెంత దుర్భర జీవితాలు గడుపుతున్నారో తేటతెల్లమౌతుంది.

## జీవన సమరంలో అలసిపోయినవారు

వీరు ధనికులు కాదు. పలుకుబడీ, అధికారం కల్గినవారూకాదు. జీవన సమరంలో అలిసిపోయి, అనామకపు బ్రతుకులు బ్రతుకుతున్నారు. కనీస జీవితావసారాలకోసం వీరు అలమటించుతున్నారు. అంతులేని నగరీకరణ క్రమంలో నలిగి పోతున్న వ్యధాభరిత జీవులు వీరు.

చౌక డిపోలవద్ద కనీస అవసరాల కోసం, నాగుబాము వలె వంకరటింకరలు తీరే అంతులేని పొడుగాటి క్యూలలో వీరి దైనందిన జీవితంలో సగభాగం ఖర్చయిపోతుంది. చౌకదుకాణాల దగ్గర సరుకులకోసం, గ్యాస్ సిలిండర్లకోసం, నీటికుళాయి కనెక్షన్ కోసం, కరెంటు బిల్లులు చెల్లించడం కోసం, సిటీ బస్‌లో సీటు కోసం, వీరు ఘడిగాపులు పడి నుంచోవలసిందే.

రోడ్లు క్రిక్కిరిసిపోయి ఉంటున్నాయి. ఆస్పత్రులు క్రిక్కిరిసిపోతున్నాయి. రోడ్లు అధ్వాన్నంగా తయారౌతున్నాయి. టెలిఫోన్‌లు తరచు మూగపోతున్నాయి.

నగర శివారుల్లో నివసిస్తున్న రిటైర్డు ప్రభుత్వోద్యోగి "తెల్లవారితే చాలు మా కష్టాలకాపురం ప్రారంభమవుతుంది రాత్రి పడుకోపోయే దాకా అన్నీ సమస్యలే" అంటున్నాడు.

"ఫిర్యాదులు చేయరాదా? అని నాతో చాలామంది అంటూంటారు. ఏమి లాభం? ఫిర్యాదులు చేసినా వినేనాధుడుంటేగా," అని మాజీ మేయరు శ్రీ ఎమ్. సత్యనారాయణ నిట్టూరుస్తూ అన్నారు. ఆయన నిరుడు ఒక ట్రెంచి గోలలో పడి చచ్చినంత పని అయింది.

## పాలకులు-పాలితుల మధ్య అగడ్త

నైజాం నవాబు పరిపాలనా కాలం పోయింది. రాజులు, మహారాజులు పాలించే రోజులు అయిపోయాయి. కాని పాలితులు పాలకుల మధ్య అగడ్తమాత్రం పోలేదు.

పాలనాయంత్రాంగంలోని వారు, మామూలు గుమాస్తా మొదలు సెక్షన్ అధిపతివరకు ప్రజలకు చేయవలసింది చేస్తే "ఏదో మహోపకారం ఒరగబెట్టినట్లు చూస్తారు" అని ఒక విసుగెత్తిపోయిన ఒక డాక్టరుగారు అన్నారు. సబ్ రిజిస్ట్రారు ఆఫీసులో పని ఉండి వెడితే వచ్చిన అనుభవం ఆయనిది. లంచం పుచ్చుకోకుండా పని జరిగితే అది గొప్ప మాట.

మండల రెవెన్యూ ఆఫీసు హైదరాబాదు నగరం నడిబొడ్డులోనే ఉంది. ఫాతిమాబీ 65యేళ్ల ముసలమ్మ కాళ్ళకు చెప్పులుకూడా లేవు. పొద్దున్న అనగా వచ్చికూర్చున్నది. కళ్లజోడు అద్దాలు పగిలిఉన్నాయి. అలాగే చూపు కనబడీ కనబడకుండ, కనబడిన ప్రతివారినీ అడుగుతుంది. ఆమెకు కావలసిన గుమాస్తాగారి దర్శనం ఇంకా అవలేదు. ఈ ఎమ్.ఆర్.వో ఆఫీసుకు ఆమె కాళ్ళీడ్చుకుంటూ రావడం ఇది నాలుగోసారి. చివరకు గుమాస్తాగారు దయచేశారు "మళ్లీ వారం రా! నీకాగితాలు వెదికిచూస్తాం" అన్నారు. పోనీ ఆఫీసరుగారిని ఒక సారి దర్శించుకుందామంటే "ఆయన మీటింగులో ఉన్నారు. పో వీలులేదని" కసురుకున్నారు. ఇంతకీ ఆమె తిరుగుతన్నది "ఘనమైన 30/- నెలవారీ పెన్షన్ కోసం! అదీ ఎమ్.ఆర్.వో పని తీరు నగరం నడిబొడ్డులో

నిరంకుశాధికార బృందం చేస్తున్న అంతులేని జాప్యాలు, అస్పష్టం అయోమయం అయిన ప్రభుత్వ నిబంధనలు, అవినీతి, లంచగొండితనం, పెచ్చుపెరిగిపోతున్న దుర్భరస్థితి-ఇదీ సామాన్యుని దౌర్భాగ్యస్థితి, పదిమంది కలసి ఏ ఆఫీసులోనైనా అల్లరీగొడవ

చేస్తే ఎప్పుడైనా నూటికీ కోటికీ ఏమైనా పరిస్థితులు బాగుపడతాయా? అంటే ఏదీ? అటువంటి చైతన్యం కూడా కనబడటంలేదు. అందుచేత ఏమిటి మార్గం? అంటే కాళ్ళావేళ్లా పడి బ్రతిమాలుకోవడమే తప్ప వేరే ఉపాయం ఏమీ లేదు. లేదా చెట్టు క్రింద ప్లీడర్లను పైరవీకార్లను పట్టుకొని ఎవరికి చదివించవలసిన "మంత్రపుష్పం" వారికి చదివించుకోవాలి. గబ్బు పట్టిపోయిన ప్రభుత్వ యంత్రాగం ప్రజల సమస్యలను పట్టించుకోదు. ముక్కుకు సూటిగా వెడితే ఏ పనీ జరగదు. అందుచేత పైరవీకారులను పట్టుకోవడమే గతి. పైనుంచి క్రింద దాకా ఎవరివాటాలు వారికి ముట్టాలి. అప్పుడు పనులు జరుగుతాయి.

## పైనుండి క్రిందివరకు "పర్సంటేజ్‌ల" పంపకం

ఒక మాజీ సైనికోద్యోగిఅన్నాడు "బాబూ ఎవరి పర్సంటేజి వారికి ముడితే గదా ప్రభుత్వ ఆఫీసుల్లో పనులు జరుగుతాయి! భగవంతుడు దిగివచ్చినా వాడికీ ఈ పాట్లు తప్పవు" అని.

అది సబ్ రిజిస్ట్రారు ఆఫీసు అయితే హోటల్లో తినుబండారాల రేట్లవలె ప్రతి పనికి రేట్లు ఉంటాయి. బ్రహ్మదేవుడు వచ్చినా సరే ఆ ముడుపులు ముడుపులే.

**34** యేళ్ళ నర్సింగ్ దాస్ ఒక ఫ్యాక్టరీ కార్మికుడు. రేషన్ కార్డు కోసం తెగ తిరుగుతున్నాడు. ఎప్పుడు దయచేస్తారయ్యా నా రేషన్ కార్డు అని అడిగితే "చూస్తాం-చేస్తాం" అని జవాబు. మళ్ళీ వారం వెళ్లాడు, ఆఫీసరు గారు ఆఫీసుకు ఆవేళరానేలేదు. మూడోవారం వెళ్ళాడు "అదిగో! చూడు ఆ గుమస్తాగారి దగ్గరకు వెళ్ళు ఫైలు ఆయన దగ్గరుంది" అన్నారు. "ఆయన నావల్లకాదు ఆఫీసరు గారు రావాలి" అన్నారు. ఇలా తిప్పి చంపుతున్నారు అని వాపోయాడు. నరిసింగదాసు.

ప్రభుత్వ కార్యాలయాల్లో సామాన్య మానవుని పాట్లు యిలా ఉంటే ఇక ప్రభుత్వ కార్యాలయాల బయట పడవలసిన పాట్లు కోకొల్లలు. "సిటీ బస్సులు ఎక్కలేం, దిగలేం, స్టాప్‌లలో ఆగవు. ఒక్కోసారి గంటల తరబడి వేచిఉన్నా బస్ దర్శనం అవదు, అన్నది" ఒక విద్యార్థిని నీలిమ. ఆమె బి.హెచ్. టౌన్ షిప్పులోంచి నగరంలోకి రోజూ రావాలి.

మలక్‌పేట గ్యాస్ కంపెనీనుండి గ్యాస్ సిలిండరు తెచ్చుకోవడానికి వెళ్ళాడు సుబ్బారావు అనే గుమాస్తా "లేదు పొమ్మన్నాడు" ఏజెంటు. నేను, నాభార్య కూడా ఉద్యోగస్తులమే ఆఫీసులకు తగలడవలసిన మాయిద్దర్లో ఎన్ని సార్లు ఎంతమందిమని

గ్యాస్ సిలిండర్ కోసం తిరగగలం? "అని నెత్తీనోరు బాదుకున్నాడు ఎన్.జి.వో! సుబ్బారావు. గ్యాస్ కనెక్షన్ తెచ్చుకోవడం ఎంత బ్రహ్మప్రళయమో గ్యాస్ సిలిండర్ తెచ్చుకోవడం కూడా అంత బ్రహ్మప్రళయంగా ఉంది అని అన్నాడు.

## పౌర సౌకర్యాల అధోగతి

మరికొంతమంది "తమ వీధిలో డ్రైనేజిపొంగి పొర్లిపోతోంది. ముక్కులు బ్రద్దలైపోతున్నాయి. రోడ్లన్నీ కంపుకంపు మహాప్రభో! మా బాధ కొంచెం చూడండ" అని మొత్తుకున్నా ఎవరూ వినిపించుకోరు అని ఆగ్రహావేశ పరవశుడయ్యాడు కలాసిగూడలో నివసిస్తున్న ఒక గృహస్తు ఈ డ్రైనేజి గొట్టాలు తాతలనాటివి హైదరాబాద్ జనాభా 5లక్షలు మాత్రమే ఉన్న అర్ధశతాబ్దం కాలం నాటివి. ఇప్పుడు ఆంధ్ర రాజధాని నగరం జనాభా 50 లక్షలు. "అయ్యా అదీ మా డ్రైనేజీల సౌభాగ్యం." అని ఒక విషాద మందహాసం చేశాడు ఆ మధ్యతరగతి మానవుడు.

ధరల బడ్జెట్ ఎలా తగ్గించుకోవాలా అని సతమతమవుతున్న రైల్వే ఉద్యోగిని శ్రీమతి కమల, సికింద్రాబాద్ లో చౌక ధరల దుకాణం దగ్గరకు వెళ్ళింది. ప్రతీసారి జవాబు ఒక్కటే "స్టాక్‌లేదు మళ్ళీవారం రండి" ఇంతలో ఉల్లిపాయల ధర ఆకాశాన్నంటాయి. కె.జి. 25రూపాయలు. మిగిలిన సరకుల ధరలూ పెరిగిపోయాయి. "ఎన్నికలన్న భయంకూడా వీటికి (సరకులకు)లేదు"

చింతపండు ధర రు50 అయిపోయేసరికి మోండా మార్కెట్‌కు వెళ్ళిన ఒక సామాన్యగృహిణికి మూర్ఛపోయినంత పనైంది.

## విషాద మందహాసాలు

మధ్యతరగతి కుటుంబాల విషాద మందహాసాలే యిలా ఉంటే ఇంకా అట్టడుగున ఉన్న పేద కుటుంబాల దీనాలాపాలు ఎలావుంటాయో వూహించుకోవచ్చు. "మాలాంటి గతుకుల బ్రతుకులు వెళ్ళ మార్చేపేదోళ్లం ఇక ఎలా బ్రతకాలి సార్" అన్నాడు సైకిలు రిక్షా కార్మికుడు అహమ్మదు. ఒక కప్పు టీ యిప్పుడు 2.50 అయిపోయింది సార్, ఇంకెక్కడి సంసారం? ఇంకెక్కడి పిల్లలు? వారి పోషణ! అన్నాడు.

హైదరాబాద్‌లో ఈ మధ్య కబర్‌స్థాన్‌లకు (స్మశానాలకు)కూడా ఖరీదులు జాస్తి అయ్యాయి. పూడ్చిపెట్టేగోతి తవ్వడానికి జాగా కావాలంటే 5వేలనుండి 10వేలు అడుగుతున్నారు.

ఊయల దగ్గరనుంచి ఏడడుగుల జాగా దాకా అన్నీ కడగండ్లే! సామాన్యుడి నొసట ఇలా రాశాడు ఆదేవుడు! అనుకోవాలి అంతే.

# పెళ్ళిళ్ళ పేరుతో పెరిగిపోతున్న ఆర్భాటాలు, అట్టహాసాలు

బొంబాయిలో ఒక వజ్రాల వ్యాపారి యింట్లో పెళ్లి జరిగింది. రెండు కోట్ల రూపాయలు పెట్టి సినిమా సెట్టింగులను తలదన్నేవిధంగా ఒక మహానగరమే ఆ మహానుభావుడు నిర్మించాడు. ఆకాశమంత పందిరి, భూదేవి అంత అరుగు వేసి ఒకనాడు రాజులు, మహారాజులు పెళ్లిళ్లు చేసేవారని కథలలో మనం చదువుకొనే వాళ్లం. అటువంటి రాజులు, మహారాజులను మించిపోయే విధంగా నేడు మనదేశంలో, మన రాష్ట్రంలో కూడా పెళ్లిళ్ల పేరుతో మితిలేని వ్యయం చేస్తున్నారు. ఆర్భాటాలు, అట్టహాసాలతో, తమ డబ్బు. పలుకుబడి, సంఘంలో హోదా, అంతస్థు, పట్టణాలలో ప్రదర్శనలుగా ఈ పెళ్లిళ్లు (Vulgar Display of Wealth) జరుపుతున్నారు. "సమాజంలో రాజకీయ రంగంలో, మా పలుకుబడి రాజకీయ వర్గాలలో మా పలుకుబడి చూసుకోండహో!" అన్నట్లుగా ఈ పెళ్లిళ్లు జరుపుతున్నారు. తమ నడమంత్రపుసిరిని వేయి విధాలుగా ప్రదర్శిస్తున్నారు.

కుమారి జయలలిత తమిళనాడు ముఖ్యమంత్రిగా తన పెంపుడుకొడుకు పెళ్లి జరిపించింది. ఆ పెళ్లికి కనీసం రు 10కోట్లు ఖర్చు పెట్టిందని పత్రికలు ఆనాడు గగ్గోలుపెట్టాయి. అక్షరాలా ఆకాశమంత పందిరి వేయించిందట ఆ మహాతల్లి! తన స్నేహితురాలు శశికళ కొడుకును తాను పెంచుకున్న కొడుకుగా ఈ అట్టహాసపు పెళ్లి జయలలిత జరిపించింది. సరే, ఆ తరువాత తాను, తన స్నేహితురాలు శశికళ ఎన్ని వందల కోట్ల రూపాయల కుంభకోణాల్లో యిరుక్కున్నారో జగమెరిగిన సత్యం. మంత్రులు, మహామంత్రులు తమాయింట పెళ్లిళ్లను తమ రాజకీయ పలుకుబడి, హోదా, తమ వైభవాలు చాటుకొనేవిధంగా ఫెళ, ఫెళార్భాటులతో జరుపుతున్నారు.

ఈ వరసన ఒకరిని చూసి ఒకరు ఎంతడబ్బు ఖర్చయినా లెక్కలేని విధంగా పెళ్లిళ్లు, ఇతర ఫంక్షన్లు, జరిపించటం ఒక అంటు జాడ్యంలా నేడు మన దేశంలో మన రాష్ట్రంలో కూడా తయారైంది. ఇదివరకు రాజులు, మహారాజులు, జమీందార్లు తమ యిళ్లలో పెళ్లిళ్లకు గాన సభలో, నృత్యప్రదర్శనలో, లేదా కవితాగోష్టిలో పెట్టేవారు. నేడు జరిగే ఆర్భాటాపు పెళ్లిళ్లలో ఆ విధంగా కళలను, సంస్కృతిని పెంచి పోషించే ధోరణికూడా

అడుగంటి పోయింది. కేవలం తమ ధన ప్రాబల్యం చాటుకోడానికే అలంకరణలకు ఆకర్షణలకే ప్రాధాన్యతయిస్తున్నారు.

ఎక్కడో ఎందుకు? సాక్షాత్తు విజయవాడలోనే జరుగుతున్న ఈ ఆర్భాటపు పెళ్లిళ్ల తీరు తెన్నులు చూద్దాం.

రాష్ట్ర బి.జె.పి. అగ్రనాయకుని కుమారుని పెళ్లి ఆమధ్య విజయవాడలో జరిగింది. ఒక నెలరోజుల ముందే కనీసం వందమంది పనివాళ్లు మద్రాసునుండి సకల హంగులతో దిగారు. కళ్యాణ మండపం లాంటి హాలు ఉండనే ఉందికాని ఒక మయసభలాంటి ప్రత్యేక పెండాలు నిర్మించారు. యాంగ్యులర్లు, ట్రెస్‌లు, అనేక లారీల లోడులు ఇక్కడకు తెచ్చారు. ఆప్రత్యేక హాలు నిర్మించడానికి సుమారు నెలరోజులు పట్టింది. ఇక వూడదీయడానికి నెలరోజులుపట్టింది. ఆహాలు అలంకరణ, విద్యుద్దీపాల అలంకరణ 20రకాల పిండివంటలతో నభూతో నభవిష్యతి అన్న విధంగా ఆ పెళ్లి జరిగింది. అఖిల భారత నాయకులు దగ్గరనుండి అన్నీ పార్టీల అగ్రనాయకులు విజయవాడ దిగిపోయారు. ఇది ఒక యింట్లో పెళ్లా? లేక ఒక రాజకీయ పలుకుబడి బల ప్రదర్శనా? అన్న విధంగా ఈ ఆర్భాటపు పెళ్లి జరిగింది.

ఇదే విధంగా విజయవాడలో ఇటీవల ఆర్భాటపు పెళ్లిళ్లు తమడబ్బు, హోదా, పలుకుబడి, ప్రదర్శించే పెళ్లిళ్లు తరచు జరుగుతున్నాయి. విజయవాడలోనేకాదు అన్నిచోట్లా జరుగుతున్నాయి. జరుపుతున్నారు, ఒక్కొక్క శుభలేఖకు పదిరూపాయలు కాదు వంద రూపాయలు వరకు ఖర్చుపెడుతున్నారు. కార్డు సైజుకాదు చేట సైజు శుభలేఖ!

ఒక విద్యుదీపాల అలంకరణకు లక్షఖర్చు. వూళ్లోపూల మార్కెట్అంతాకొనితెచ్చి పెళ్లి మండపమే కాదు. పెళ్లి పందిరి అంతా పూలతో నింపివేసి లక్షలకు లక్షలు డబ్బు అలంకరణలకే వెచ్చిస్తున్నారు.

తిన్నంతతిని, ఎక్కువ పారవేసే 20 రకాల వంటకాలు, పిండివంటలు, స్వీట్లు మొదలైన బోజనాలు సంగతి చెప్పనక్కరలేదు. ఎన్ని వందలు కాదు ఎన్నివేలమంది అతిదులు అన్నది ప్రశ్న.

తమ కుటుంబానికి, తమ దగ్గర మిత్రులకు పరిమితం అవడంకాదు తండోపతండాలుగా అతిధులకు ఆహ్వానాలు. వెళ్లకపోతే ఎక్కడ వెలితి పడిపోతామో అనుకొనే వ్యాపార సంబంధాలవారు, రాజకీయ సంబంధాలవారు. ఫెళ ఫెళార్భాతాలతో కార్లలో దిగిపోతారు. పెళ్లి చూడటం, వధూవరులను ఆశీర్వదించడం ముఖ్యం కాదు. వ్యాపార సంబంధాలు, రాజకీయ సంబంధాలు పురస్కరించుకొని అంతస్థుల వారీగా

పలకరించుకొని, పరిచయాలు పునరుద్ధరించుకొనే "పలుకుబడుల మేళాల" క్రింద ఈ ఆర్భాటపు పెళ్లిళ్లు మారిపోతున్నాయి." ఇవి డబ్బు, హోదా, నగలు, పట్టుచీరల ప్రదర్శనలా? లేక వైవాహిక వేడుకలా? అని సందేహాలు కల్గుతున్నాయి.

ఇక కట్నాలు కానుకల సంగతి చెప్పనక్కరలేదు. లక్షల మీద కాదు కోట్ల మీద యిచ్చిపుచ్చుకోడాలు జరుగుతునాయి. ఇవన్నీ నూటికి 99 పాళ్ళు పెద్దలు కురుద్చుకొనే పెళ్లిళ్లే, ఇవి వధూవరుల యిష్టాయిష్టాలతో జరుగుతున్న పెళ్లిళ్లా? వధూవరుల అభిమతాలకు అన్యోన్య భావాలకు ప్రాధాన్యత యిస్తున్న పెళ్లిళ్లా? అని ఎవరూ చూడటం లేదు. ఆర్థిక రాజకీయ సంబంధ బాంధవ్యాలకు ప్రాధాన్యత యిస్తున్న పెళ్ళిళ్లే ఎక్కువ.

## పెళ్లిళ్లంత ఆర్భాటంతో నిశ్చితార్థాలు

ఇక పసుపు కుంకుమల పేరుతో, నిశ్చితార్థాల పేరుతో పెళ్లిళ్లంత ఆర్భాటాలు జరుపుతున్నారు. వందలాదిమందికి బోజనాలు ఆ అట్టహాసాలకు ఖర్చులకు అంతులేదు.

నిశ్చితార్థాలకు ఇంచుమించు పెళ్లితంతు అంతా జరిపి, ఫొటోలు, వీడియోలు తీయించి ఇక ఏకారణం చేతనైనా ఆ పెళ్లి చెడిపోతే ఇక చూసుకోండి, ఆ ఫొటోలు, ఆవీడియోలు యిచ్చిన కట్నాల అడ్వాన్సులు వెనక్కుతీసుకోలేక పడే అవస్థలు, అగచాట్లు దేవుడికే ఎరుక.

పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లు ఈ నడమంత్రపుసిరి వర్గాల నాట్యాలను చూసి మధ్యతరగతి కుటుంబాలు, ఇదే రకమైన ఆర్భాటపు పెళ్లిళ్లకు ఎగబ్రాకి, అప్పులపాలై చతికిల పడిపోతున్న ఉదంతాలు లెక్కలేనన్ని. రానురాను డబ్బు సంబంధాలు తప్ప, అనురాగ సంబంధాలు, ఆప్యాయతతోకూడిన సంబంధాలు కాకుండా ఈ పెళ్లిళ్లు తయారవుతున్నాయి.

## జాతీయోద్యమ కాలంలో

ఒక యాభై సంవత్సరాల కాలం వెనుదిరిగి చూసుకుంటే దేశంలోను, రాష్ట్రంలోను నిరాడంబరమైన పెళ్లిళ్ళకు, పరిమిత వ్యయంతో పెళ్లిళ్లకు ప్రాధాన్యత యిచ్చేవారు. సేవాగ్రామంలో గాంధీజీ ఆధ్వర్యంలో జరిగిన పెళ్లిళ్లను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుందాం. వధూవరులు, అతిసన్నిహితులైన పదిమంది బంధుమిత్రుల సమక్షంలో దండలు మార్చించడమో, వుంగరాలు మార్పించడమో, వధూవరులచే ప్రమాణాలు చేయించడమో ఆ విధంగా పెళ్లిళ్లు జరిగేవి. ఇందిరాగాంధి, ఫిరోజ్‌గాంధి పెళ్లి అలాగే జరిగింది. గోరా గారి

కుమార్తె పెళ్లి సవా గ్రామంలో అలాగే జరిగింది. సరోజనిదేవి ముత్యాల గోవిందరాజుల నాయుడు పెళ్లిని కందుకూరి వీరేశలింగంగారు హైద్రాబద్‌లో బ్రహ్మసమా. విధిని నిరాడంబరంగా జరిపించారు. సంస్కృత మంత్రతంత్రాల పెళ్లిళ్ల బదులు అచ్చతెలుగులో వివాహ ప్రమాణాలు చేయించి దండలు మార్పించి పదిమందికో పాతిక మందికో టీ పార్టీలతో పెళ్లిళ్లు జరిగేవి. ఇవి పూల దండల పెళ్లిళ్లుగా ప్రసిద్ధి కెక్కాయి. ఈ సంస్కరణ వివాహాలలో భాగంగానే రిజిష్టర్డు పెళ్లిళ్లు జరిగేవి. రిజిస్ట్రారుకు నోటీసు యిచ్చి పిలిపించి పెళ్లిని రిజిష్టర్లు చేయించేవారు. తమిళనాడులో ఆత్మగౌరవం Self Respect movement ఉద్యమంలో భాగంగా నిరాడంబర సామూహిక వివాహాలు జరిపేవారు, పూలదండలు, మంగళ సూత్రాలు కట్టించడమో చేసి పెళ్లి తంతు ముగించేవారు.

జాతీయోద్యమ కాలంలో ప్రారంభమైన ఈ నిరాడబర వివాహాలను కమ్యూనిస్టు ఉద్యమం మరింత ముంధుకు తీసుకుపోయి మితవ్యయంతో పూలదండలతో పెళ్లిళ్లు జరిపే సంస్కరణ వివాహాల సంస్కృతి వచ్చింది.

త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ప్రారంభించిన స్వసంఘ పౌరోహిత్యాలు, సంస్కరణ వివాహ విధులు ఆనాడు వాడుక లోకి వచ్చాయి. ఆదర్శవివాహాలుగా జరిగేవి.

ఇప్పుడు ఆ సంఘసంస్కరణ, నిరాడంబర పెళ్ళిళ్ళ యుగం అంతరించిందా? అన్నట్లు తిరిగి యధావిధంగా బ్రహ్మణ పురోహితుల ఆధ్వర్యాన, సకల మంత్ర, తంత్ర సంప్రదాయాలతో వివాహాలు; కాళ్లు కడిగి కన్యాదానాలు, సరే ఇక అంతులేని పటాటోపం, అట్టహాసాలతో పెళ్లిళ్లు జరుగుతున్నాయి.

## ఆర్థిక, సామాజిక కారణాలు

పిండి కొద్ది రొట్టె అన్నట్లు డబ్బు కొద్ది ఆడంబర వివాహాలు మళ్లీ అమలులోకి వస్తున్న ఇటువంటి ఆర్భాటపు పెళ్లిళ్ల వెనుకనున్న ఆర్థిక సామాజిక పరిణామాలను అవగాహన చేసుకొకుండా వివాహ విధానంలో ఈ తిరోగమనధోరణి ఎందుకు వచ్చిందో అర్ధంకాదు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సమాజంలో నడమంత్రపు సిరివర్గాలు వెలిశాయి. జాతీయోద్యమ లక్ష్యాలుగాని, గాంధీజీ కలలుకన్న దరిద్ర నారాయణుల సముద్ధరణ లక్ష్యాలు గాని నెరవేరలేదు. స్వాతంత్ర్య భారత పాలకవర్గాలు ఆచరణలో అమలు జరిపింది-భారత రాజ్యాంగంలో చెప్పుకొన్న ఆర్థిక, సాంఘిక న్యాయం, సోషలిస్టు సమాజ విధానం కాక పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధి విధానం అమలు జరిపారు. ఇది పంచవర్ష ప్రణాళిలలో చెప్పుకొన్నవిధంగా ఆర్థిక, సాంఘిక న్యాయంతో కూడిన ఆర్థికాభివృద్ధి

కాదు. ఒకవైపు సంపద కేంద్రీకరణ, మరొక వైపు సమాజంలో సగభాగం దారిద్ర్యరేఖకు దిగువనుండే ప్రజానీకం; ఆర్థిక వ్యత్యాసాలు పెరిగిపోయే-ఆర్థిక రాజకీయ విధానాలు అమలు ,జరిగాయి.

పెద్ద యెత్తున దేశంలో మధ్యదళారివర్గాలు పెరిగారు. సంపదను ఉత్పత్తి చేసే వర్గాలు కంటే ఉత్పత్తి అయిన సంపదను కొల్లగొట్టే వర్గాలు పెరిగి పోయాయి. వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో ఉత్పత్తిని పెంచే పెట్టుబడి సేకరణ కాక, చట్టా వ్యాపారం(Speculation) బ్లాక్‌మార్కెట్, బ్లాక్‌మనీ (Non Productive Capital formation) Â°రిగింది. దేశంలో పోటీ ఆర్థిక వ్యవస్థపై (Parallel economy) పెరిగింది. అక్రమ సంపద, అన్యాయార్జితం( Un accounted money) పెరిగింది. అవినీతి, అంచగొండితనం పెరిగింది. కుంభకోణాలు (Scams) పెరిగాయి, స్విస్‌బ్యాంకుల రహస్య ఖాతాలు పెరిగాయి.

ఈ గుప్తధనం చిద్విలాసాలలో భాగమే, వాటి ప్రతిబింబమే ఈ ఆర్భాటపు పెళ్లిళ్లు, అట్టహాసాలున్ను ఈ పెళ్లిళ్లద్వారా బ్లాక్‌మనీని, వైట్‌మనీగా చెలామణీ చేసుకుంటున్నారు. తమ పలుకుబడి, ప్రాభవం, ప్రభావం పెంచుకోడానికి ఈ ఆర్భాటపు పెళ్లిళ్లు చేస్తున్నారు.

## "కుక్కలతో పోరాడి కూడు తినే వర్గాలున్న దేశంలో ..."

జాతీయోద్యకాలంలో గరిమెళ్లసత్యనారాయణగారు "మా కొద్దీ తెల్లదొరతనము' ' అనే పాట వ్రాశారు. ఆ పాటలో "పన్నెండు దేశాలు పండుచున్నాగాని పట్టెడన్నమే లోపమండి! అయ్యో! కుక్కలతో పోరాడి కూడు తింటామండి! మాకొద్దీ తెల్లదొరతనము' ' అని దేశప్రజల దౌర్భాగ్యస్థితిని అభివర్ణించారు.

యాభై సంవత్సరాలు స్వాతంత్ర్యానంతరం ఈదేశంలో యింకా "కుక్కలతో పోరాడి కూడు తినేవారు" మనకళ్ళ ఎదుట కనబడుతూనే ఉన్నారు.

ఈ పెళ్లిళ్ల సందర్భంలో వీధిలోకి విసిరే విస్తరాకులలో ఎంగిలిమెతుకులు కుక్కలతో పోరాడి ఏరుకొని తినే దౌర్భాగ్యులు మనకళ్లకు కనబడటంలేదా? ఒక పూట తింటే ఒక పూట తిండిలేనిగర్భ దారిద్ర్యంతో కుమిలి పోయేవారు లేరా? ప్రపంచంలోకెల్లా బాలకార్మికులు మన దేశంలోనే ఎక్కువగా లేరా? చదువు కోవలసిన పిన్న వయస్సులో ప్రాణాంతకమైన పరిశ్రమలలో పనిచేసే లక్షలు కోట్లాది బాలబాలికలు లేరా? నూటికి 60-70మంది నిరక్షరాస్యులు మనకళ్లెదుట లేరా? కోట్ల కొలది నిరుద్యోగులు, కూడు,గుడ్డ, గూడు లేని కోటానుకోట్ల దరిద్ర నారాయణులు లేరా? పల్లెటూళ్లలో జీవనోపాధిలేక

పట్టణాలకు ఎగ(బాకి, ఫుట్‌పాత్‌ల మీద, కాలవగట్ల మీద, సిమెంటు తూములలో. వంతెనల దిగువలో పుట్టి, పెరిగి, చచ్చే దీన జనులు కోట్లాదిలేరా?

ఈ ఆర్భాటపు, అట్టహాసపు పెళ్లిళ్లు జరిపేవారు ఒక్క క్షణం-మానవత్వంతో ఆలోచిస్తే, దయ కరుణ, జాలి, మంచి మనసులతో ఆలోచిస్తే ఈ (Vulgar Display of Wealth) డబ్బు విరగబాటు తత్వం ఎంత అవమానకరమో ఎంత సిగ్గుచేటో తమ మనస్సుకే తోచదా? దేవుని పూజలు చేసే భక్తి (ప్రపత్తులు కల్గినవారు తోటి మానవులదుర్భర జీవితాల గురించి ఆలోచించలేరా?

ఒక పెళ్లికి లక్షలు, కోట్ల రూపాయలు ఖర్చు పెట్టే బదులు ఒక పూలదండతో ఒక మంగళసూత్రంతో, ఒకమంగళవాయిద్యంతో, పెళ్లి చేసి ఆ డబ్బు ఒక విద్యాకేంద్రానికో, ఒక వైద్యకేంద్రానికో ఒక మంచినీటి కుళాయి ట్యాంకుకో, ఒక దేశ భక్తియుత కార్యక్రమాలకో, ఒక గ్రామ గ్రంధాలయానికో వెచ్చించాలని తోచదా? ఒక పెళ్లికి కోటి రూపాయలు లేదా కొన్ని లక్షలు ఖర్చు చేసే బదులు, పెళ్లిళ్ల కాక, కట్నాలు యిచ్చుకోలేక అవివాహిత కన్యలుగా, వృద్ధకన్యలుగా మిగిలిపోతున్న పదిమంది అభాగ్య యువతులకు నిరాడంబర, సామూహిక వివాహాలు చేయించరాదా?

ఇలా ఎన్నైనా ప్రజా హిత కార్యక్రమాలకు ఆ డబ్బు వినియోగించవచ్చు. కావలసింది ఒక్కటే అది కనీస మానవత; కావలసింది ఒక్కటే-అది కనీస సాంఘిక బాధ్యత; కావలసింది ఒక్కటే అది కనీస దేశభక్తి. ఈ దేశంలో పుట్టి ఈ దేశంలో నీరు త్రాగి, ఈ దేశంలో గాలి పీల్చి జీవించుతున్నామనే వీరికి ఉండవలసిన కనీస స్పృహ!

గాంధీ గారి ధర్మకర్తృత్వ సిద్ధాంతం సంగతి ఆ మహాత్మునికే ఎరుక! ఆకలిగొన్న వారికి అన్నం రూపంలోనే దేవుడు ప్రత్యక్షం కావాలి అన్న గాంధీ నానుడి - అదేవదేవునికే ఎరుక.

కుక్కలతో పోరాడి కూడుతినే దేశ ప్రజలు యింకా మనకళ్లఎదుట ఉన్నారన్న కనీస మానవతాధర్మం గురించి ఒక్క క్షణం ఆలోచిస్తే ఈ ఆర్భాటపు, అట్టహాసపు పెళ్లిళ్లు ఆపి, నిరాడంబర వివాహాల గురించి మళ్ళీ ఆలోచించగలరేమోనన్న ఆశతో...

"... యధార్ధవాధి"

## పాఠకులకు విజ్ఞప్తి

కమ్యూనిజంలో ప్రచురించే వ్యాసాలపై పాఠకులు తమ సవిమర్శక అభిప్రాయాలు, సూచనలు పంపవలసిందిగా కోరుతున్నాం

# ప్రపంచ మతాల దృక్పథంలో స్త్రీల పాత్ర

-శ్రీమతి మల్లాది సుబ్బమ్మ

హిందూ, ముస్లిం, క్రైస్తవ మతాలు ముఖ్యమైనవి మూడు. ఇవి భారతదేశంలోనేకాక ప్రపంచమంతటా స్త్రీలపై స్వైరవిహారం చేస్తున్నాయి. ఇవికాక జైనం, బౌద్ధం, పార్శిమతాలు కూడా వున్నాయి. ఈ మతాలన్నీ స్త్రీని ఎలా చూస్తున్నాయి. ఎన్ని విధాలయిన విధి నిషేధాలు వారిపై నిర్దేశింపబడ్డాయి. అసలు స్త్రీ స్థానం ఏమిటి? ఆమె ఎందుకలా చూడబడుతున్నది? ఈ మతాలను గౌరవించే స్త్రీలలో ఐక్యత ఎందుకు లేదు? తమ పరిస్థితిని మార్చుకోటానికి నాటి నుండి నేటి వరకు ఎందుకు ప్రయత్నించలేదు? ఈ పరిస్థితి మారి స్త్రీలు కూడా పురుషులతో సమాన హోదా సిద్ధించటానికి మార్గాలేమిటి? అనేది నేటి చర్చనీయాంశం.

## మతం ఆధారంగా ఉద్యమాలు

ఈనాడు మతం మీద ఆధారపడిన ఉద్యమాలు, తగాదాలు, సంఘర్షణలు, కొట్లాటలు, హత్యలు, విధ్వంసాలు, యుద్ధాలు ప్రపంచం అంతటా వ్యాపించి వున్నాయి. మతభావనపై నిర్మించబడిన భావాల ప్రచారం జోరుగా సాగుతున్నది. మా మత వ్యవహారాలలో వేరొక మతం వారు కలుగజేసుకోవద్దనే వాదన ప్రబలంగా వినబడుతోంది. అంతేకాక మతం పేరుతో ఒక మత సమాజంలో జరిగే అక్రమాలను, అన్యాయాలను కొనసాగనివ్వాలని, అలా జరుగనివ్వకపోతే తమ మతం ప్రమాదంలో పడుతున్నదని గగ్గోలు పెట్టడం పరిపాటి అయ్యింది. ఈ నేపథ్యంలో మత ఛాందసం స్త్రీలకు ఎలా నష్టదాయకంగా పరిణమించిందో పరిశీలించడం అవశ్య కర్తవ్యం.

## మతగ్రంథాలు - స్త్రీ ప్రస్తావన

ప్రతి మతానికీ సర్వసాధారణంగా ఒక ప్రమాణ గ్రంథం వుంటుంది. ఒక అవతారమూర్తి లేక ప్రవక్త లేక మతాచార్యుడు వుంటాడు. ప్రమాణగ్రంథంలోని అంశాలు, అవతారమూర్తి లేక ప్రవక్త లేక మతాచార్యుని ప్రవచనాలు, బోధలు, చర్యలు, ఆదేశాలు పరమపవిత్రంగా భావించబడతాయి. మత ఛాందసవాదుల దృష్టిలో వాటిని మార్చు అధికారం, అవకాశం ఎవ్వరికీ లేదు. కనీసం వాటికి సనాతన విధానంలో కాక మరో

పద్ధతిలో భాష్యం చెప్పటం గాని, వ్యాఖ్యానం చేయటంగాని జరగరాదు. అలా చేసిన వ్యక్తులు చేయటానికి ఉద్యుక్తులయ్యే వ్యక్తులు నిందార్హులు; దండనార్హులు. వారిని హతమార్చినా తప్పులేదు. వారిని చంపటం మతస్థుల విద్యుక్త ధర్మమని మతాచార్యులు ప్రకటించడం చూస్తున్నాం.

ఇంగ్లండులోని సాల్మన్ రషీద్‌కు, బంగ్లాదేశ్‌లోని శ్రీమతి తస్లిమా నస్రీన్‌కి యిలా మరణదండన విధించటం గమనార్హం. "మతం మత్తుమందులాంటిది" అన్నాడు మార్క్స్. అలాంటి మతశక్తుల కౌగిళ్లలో బిగింపబడ్డ ఒకానొక అభూతకల్పనే భారత మహిళల సంస్కృతి.

హిందూ సంస్కృతికి మూలం వేదాలు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణాలు. ముస్లిం సాంప్రదాయాలకు మూలం షరియత్ చట్టం. దానికి నాంది 'ఖుర్‌ఆన్' క్రైస్తవ మతానికి 'బైబిల్ శిరోధార్యం. ఈ మూడు మతాలు స్త్రీల పట్ల అనేక విధినిషేధాలు విధించాయి. వారికి బాధ్యతలేతప్ప హక్కులు అధికారాలు కాగడావేసి గాలించినా దొరకవు. ఏ దేశంలోనూ, ఏ మతంలోనూ, ఏనాడు ఏ స్త్రీ సమానహోదా కాని, తాహతు కాని అనుభవించినట్లు ఆధారాలు లేవు. వేదాలు చదివినా, నాటి వ్యవస్థ చూచినా స్త్రీకి ప్రత్యేక విశిష్టత వున్నట్లు కన్పించదు. అసలు వేద ప్రవచన చేసిన ఋషులలో స్త్రీలు ఒకరిద్దరు తప్ప లేనేలేరు. పైగా స్త్రీలు వేదం చదువరాదనే ఆంక్షలుకూడా వచ్చాయి.

## స్త్రీ అంటే ఆటబొమ్మా! బానిసా!

స్త్రీ అంటే 'ఆట బొమ్మని', ఒక బానిస అని, భర్తకు శుశ్రూష చెయ్యటమే ఆమె విధి అని మతవాదుల మస్తిష్కాలనిండా చెరగని ముద్రగా నిలిచిపోయాయి. మతదృష్టిలో 'సమాజం' అంటే పురుషులేనని, వారి అవసరాలను తీర్చు యంత్రం మాత్రమే స్త్రీ అని తేల్చారు. మతం స్త్రీ స్థానాన్ని పురుషుడి పాదాలచెంతనే వుంచింది. శైశవం దాటగానే మెల్లిగా మాట్లాడాలని, తలెత్తుకొని తిరుగరాదని, నిటారుగా నిలబడరాదని శాసించింది. భర్త ఆజ్ఞలను శిరసావహించాలని అత్తమామలకు అణిగిమణిగి వుండాలని, స్త్రీకి ఇల్లే స్వర్గమని, భర్తే పరమదైవమనే విధినిషేధాలు ధర్మశాస్త్రాల్లో దర్శనమిస్తాయి. స్త్రీ ఆజన్మాంతం ఎలా జీవించాలో కుమారిశతకం లాంటివి రాయించి వివరంగా బోధించారు. మతస్థులు, హిందూమతం, ఇస్లాం, క్రైస్తవం ముఖ్యమైన మతాలు. మనుధర్మశాస్త్రం, ఖుర్‌ఆన్, బైబిలు లాటి మత గ్రంథాలు. అవి స్త్రీని చాలా నీచాతినీచంగా చిత్రించాయి. "స్త్రీలు నరకానికి సింహద్వారం" వంటివారన్నాడు శంకరాచార్యుడు. ఆడది పాపగర్భం నుండి జన్మించిందంటుంది భగవద్గీత. ఆడదానికి ఆజన్మాంత సంరక్షకత్వం

ప్రతిపాదించింది మనుస్మృతి. స్త్రీని బానిసత్వానికి చిహ్నంగా ఆటబొమ్మగా మార్చేశాయి. ధర్మశాస్త్రాలు, ఇస్లాం స్త్రీలను 'జంతువు'లతో పోల్చింది. స్త్రీని పొలంగా పేర్కొంటూ దానిపై సర్వాధికారాలు "ఈవ్"గా ప్రతిపాదించింది క్రైస్తవం. 'నీకు విధేయత చూపుతా' నని పెళ్లినాటి ప్రమాణాలల్లో సైతం స్త్రీచే ప్రమాణం చేయిస్తుంది.

## పురుషునికోసం స్త్రీని సృష్టించాడా దేవుడు?

పురుషుని ముందు సృష్టించి, అతని సంతోషం కోసమే స్త్రీని దేవుడు సృష్టించాడని ప్రచారం చేస్తోంది బైబిలు. అసలు పురుషపతనానికి కారణం కూడా "ఈవ్" ఆడదేనని ఈసడిస్తుంది. మత సంస్కర్తల్లో ముఖ్యుడైన బుద్ధుడు సైతం స్త్రీలకు భిక్షుణిలుగా ప్రవేశార్హతలేదన్నాడు. పెంపుడు తల్లి గౌతమి బుద్ధునితో సర్వసంగ పరిత్యాగం చేయగలమని, తమకు మోక్షార్హత కావాలని వాదించిన తర్వాతే స్త్రీలకు బౌద్ధసన్యాసినులుగా అవకాశమిచ్చాడు. ఇలా అన్ని మతాలు అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో స్త్రీ అంటే పురుషుని భోగ్యవస్తువని, పిల్లల్ని కనే యంత్రమని, వంశాన్ని వృద్ధి చేయడానికి ఆమె సృష్టించబడినదని మత గ్రంథాలన్ని ధృవీకరించాయి.

అసలు మత ప్రవక్తలు, మతాధికారులు, బిషప్పులు అంతా పురుషులే. శాసనకర్తలు, ధర్మశాస్త్ర నిర్ణేతలు సైతం పురుషులే. కనుక వారి ఆధిపత్యాన్ని పెంచుకున్నారు; అలా ప్రచారం చేసుకున్నారు. స్త్రీలు తమ లొంగుబాటును చూపడమే పాతివ్రత్యమంటూ, అదే భారతీయ సంస్కృతి అని ఆడవారికి - బ్రహ్మాండమయిన 'బ్రెయిన్ వాష్' చేయబడ్డది. అదే తరతరాల సంస్కృతిగా ప్రపంచ స్త్రీల నరనరాలకు నాటుకుపోయింది.

"పురుషుణ్ణే కేంద్రంగా వుంచి ఆరాధించాలి. ఆమె అతని ఆస్తిగా వస్తువుగా చలామణికావాలి" ఇలాంటి ఈ సమాజపు సంప్రదాయానికి, సంస్కృతికి విరుద్ధమైన ఆలోచన ఆమె ఈనాటికీ చెయ్యలేకపోతోంది. కనుకనే ఆధునిక భావాలు, శాస్త్రీయ దృక్పథం ఆమెలో మృగ్యమయ్యాయి. స్త్రీ కూడా మనిషేనని ఆమెకు స్వేచ్ఛ, సమానత్వం, వ్యక్తిత్వం వుండాలని ఏ మతమూ బోధించనే లేదు. అందువల్లే పురుషాధిక్యతను తలదాలుస్తున్నారు.

చాలామంది స్త్రీలు ఏదో ఒక మతంలో నమ్మకం కలిగివుంటారు. వారి కాలమంతా ప్రార్థనలకు, బైబిలు పఠనానికి, నమాజ్ చెయ్యటానికి వినియోగిస్తారు. ఇంకా పాతివ్రత్యం పేరుతో భర్త ఎంత దుర్మార్గుడయినా దుష్టుడయినా తమ, ధన, మాన ప్రాణాలు అర్పిస్తున్నారు. అలా స్త్రీ జీవితమంతా మూఢాచారాల ముసుగులో మిళితమయి వుంటుంది. చెట్టుకూ, పుట్టకూ, పోలేరమ్మకు మ్రొక్కడం, బిడ్డలకోసం

ప్రదక్షిణాలు చెయ్యడం లాంటి ఆచారాలు సవాలక్షా వున్నాయి. రోగికి వైద్యం చేయించరు. కాని చస్తే వేలకు వేలు ఖర్చుపెట్టి దినవారాలు చేస్తారు. ఈనాటికీ వైధవ్యం పేరుతో జుట్టు, గాజులు, సూత్రం తీయకతప్పడంలేదు. ఇంకా మహిమలు, బాబాలు, మంత్రతంత్రాల నమ్మిక స్త్రీలలో మిక్కుటంగా వుంది. ఈ తరతరాల దాస్యభావనకు మత ప్రభావమే నాంది అనేది పచ్చి నిజం.

## మతం మహోన్నతమని . . .

తమ మతం మహోన్నతమైనదని, దాన్ని నిరశించరాదనే నమ్మికతో మత సంరక్షణార్థం ఎంతటి దారుణానికైనా వెనుదీయరు మతవాదులు. వేదాలు నమ్మనివారిని 'పాషండు'లని, బైబిలు నమ్మనివారిని 'అన్యులు' అని, ఖుర్‌ఆన్‌ను విశ్వసించనివారిని 'కాఫిర్లు' అని దూషిస్తారు. అంతేకాదు మత అసహనంతో అన్యమతస్తులను అసామాన్యమైన చిత్రహింసలపాలు చేశారు. సజీవ దహనాలు లెక్కకు మిక్కుటంగా జరిగిన దాఖలాలున్నాయి. మతం విశ్వాసం మీద ఆధారపడుతుంది. మతానికి నాంది దేవుడు, కర్మ, పునర్జన్మ, పాపపుణ్యాలు, మహిళలు తమ అస్తిత్వాన్ని, దుస్థితిని గురించి హేతుబద్ధంగా ఆలోచించలేక పోవటానికి కారణం మతం. పూర్వజన్మ, కర్మ, భగవంతుడు అనే సంకెళ్లతో స్త్రీని బంధించి తద్వారా పాపం, పుణ్యం, నరకం, అదృష్టం, దురదృష్టం అనే ముసుగు తొడిగి ఆమెకు ప్రబోధం చేశారు. వీటికి తోడు వేల సంఖ్యలో మూఢ విశ్వాసాలు ఆమెను ఆజన్మాంతం పట్టి పీడిస్తూ ఆమెను విధిచేతిలో 'కీలుబొమ్మ'ను చేశాయి. మతస్తులు సృష్టించిన దేవుణ్ణి, కర్మ సిద్ధాంతాలను బలపర్చటానికి బైబిలు, ఖురాన్, వేదాలు, ఉపనిషత్తులు, ధర్మశాస్త్రాలు అత్యధికస్థాయిలో వెలువడ్డాయి. మనువుతోపాటు 27 మంది ఋషులు వివిధ కోణాలనుండి స్త్రీధర్మాలను ప్రతిపాదించారు. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే ఉత్తేజపూరితమైన ఫ్రెంచి ప్రకటన మానవహక్కులకు పునాదిరాళ్లు. మానవ అంటే స్త్రీపురుషులిద్దరూ కనుక మానవహక్కులు స్త్రీలకు కూడా చెందాలి అనేది తథ్యం.

## వేదకాలంలోనే పతనం ప్రారంభం

ఆ వారసత్వ పంథాలో ఉద్యమించినదే 1950లో లిఖించిన మన భారత రాజ్యాంగం. అందులో ఆర్టికల్ 14లో స్త్రీ పురుష వివక్షలేదని వ్రాసుకున్నాం. కాని ఆచరణలో అది మనకు నూరామడల దూరంలో వుంది. అలాగే క్రైస్తవుల పెళ్లినాటి ప్రమాణాల్లో "లవ్ అండ్ ఛెరిష్" అంటాడు పురుషుడు. కాని స్త్రీ "లవ్, ఛెరిష్ అండ్ ఒబె' ' అనాలి. అంటే స్త్రీ పురుషునికి విధేయురాలిగా వుండాలి. అలాగే ముస్లిం వివాహంలో

'నిఖా' రిజిష్టరులో పురుషుడు మాత్రమే దస్కతు (సంతకం) చేస్తాడు. కాని స్త్రీ చెయ్యనక్కరలేదు. కారణం రాజ్యాంగం కాని, చట్టాలు కాని కరుడుకట్టిన మన సనాతన భావాలను మార్చలేవు. వేదకాలం (2500-1500 బిసి) (అంటే 4 వేల ఏళ్లనుండి మతం మహిళ మీద స్వైరవిహారం చేస్తూ వుంది. ఆమె జీవితాన్ని అధోగతిపాలు చేసింది. ఆమె మానసిక ప్రవృత్తులను అణచివేసింది. ఋగ్వేదకాలంలో స్త్రీ పురుష తేడాలు పెద్దగా లేవని ఆల్‌టేకర్, కపాడియా, ఇంద్రలాంటి పరిశోధకులు వెలిబుచ్చారు కాని "ఓ దేవా నాకు కుమారుణ్ని ప్రసాదించుము" అనే ప్రార్థనతో స్త్రీ పతనానికి అక్కడే ప్రాతిపదికలు పడ్డాయి. అధర్వణవేదంలో ఆడపిల్ల పుట్టరాదనే భావం బాగా ప్రబలి వ్రతాలు, ప్రార్థనలు కూడా చేశారు. అందువల్ల కన్యల స్థితి ఘోరరూపం దాల్చింది. పున్నామ నరక విముక్తికోసం పుత్రుడు కావాలనే క్రతువులు చేశారు. ఋగ్వేదంలో మతంలోను, సాంస్కృతిక రంగంలోనూ భాగస్వామియైన స్త్రీ అధర్వణవేదం చివర - బ్రాహ్మణాలకు ముందు నియోగ పద్ధతిలో పిల్లవాణ్ణి కనడమేకాక ఆమె కేవలం పిల్లల తల్లిగా మిగిలిపోయింది. క్రమేపి ఆడపిల్ల పుట్టుక దురదృష్టమయింది. కడకు విధవా వివాహాలు నిషేధమయ్యాయి. అలాగే "యహోవా" ప్రక్కటెముకలో నుంచి 'ఈవ్' పుట్టి జ్ఞాన ఫలాన్ని తినిపించి అతని పతనానికి మూలమైందని ఈనాటికి స్త్రీని ఈసడిస్తుంది క్రైస్తవం. అలాగే ఈనాటికి నలుగురు స్త్రీలను పెళ్లాడే హక్కు, 'తలాక్'తో స్త్రీ వివాహ విచ్ఛిత్తికి కారణభూతమైనది ముసల్మాను మతం.

## క్రైస్తవంలో స్త్రీల హోదా

స్త్రీ చేసిన తప్పిదం వల్లనే ఈ ప్రపంచంలోని చెడంతా పుట్టిందని బైబిలు నిర్వచించింది. కనుకనే క్రైస్తవ మతస్తులు స్త్రీలను వేటాడిన కథలు చెప్పితే తీరేవి కావు. ఇక క్రైస్తవ మత చరిత్ర పరిశీలిస్తే స్త్రీల దైన్యావస్థ వర్ణనాతీతం. 558 ఎ.డి.లో 59 మంది బిషప్పులు మేకప్ (Macon) లో అసలు స్త్రీకి 'ఆత్మ' వున్నదా? అని చర్చించి చివరికి అతి కొద్ది మెజారిటీతో వున్నదని వప్పుకున్నారట. అలాగే గ్రీకు చర్చిలో చాలాకాలం తరువాత కాని స్త్రీని వ్యక్తిత్వమున్న మనిషిగానే గుర్తించలేదని చరిత్రలో వుంది. రష్యాలో జనాభా లెక్కలు వ్రాసేటప్పుడు పురుషులను మాత్రమే లెక్కకు తీసుకున్నారు కాని స్త్రీలను చేర్చనేలేదు. 1854లో ఫిలడల్ఫియాలో స్త్రీల హక్కుల మహాసభలో (ఉమెన్సు రైట్సు కన్‌వెన్షన్) " స్త్రీలకు ఆత్మలున్నాయని రుజువు చెయ్యాలి" అని సవాలు చేస్తూ కొందరు అరుస్తూ సభలో అల్లరిచేసి సభను చెల్లాచెదరు చేశారు.

## స్త్రీల అమ్మకం

ఇంగ్లండులో, అమెరికాలో స్త్రీలను పశువులులాగా అయిదు డాలర్ల నుండి

అయిదువేల డాలర్లవరకూ అమ్మడం జరిగింది. అలాగే కోపర్నికస్ సిద్ధాంతాన్ని గణిత శాస్త్రరీత్యా సమర్థించిన కెప్లరును కన్నందుకు ఆయన తల్లి ఒక కర్ణపిశాచి అయివుంటుందని మతస్తులు ఆమెను బందీ చేశారు. ఇలా కర్ణపిశాచులనే మిషతో క్రైస్తవమతం షుమారు కొన్నివేలమంది స్త్రీలకు పొట్టనపెట్టుకున్నట్లు చరిత్రకారులు అచంనాకట్టారు. ఇంకా మతేతరుల కన్యలను మండుతున్న పీఠాలపై కూర్చోబెట్టినట్లు దాఖలాలున్నాయి. ఇలాంటి అత్యాచారాలు స్త్రీలపై 5,6 శతాబ్దాలలో జరిపినట్లు చరిత్ర రుజువు చేస్తోంది.

## బైబిల్‌లో స్త్రీ గురించి

బైబిలు స్త్రీని గురించి ఎలా ఆలోచించిందో తెలియాలంటే బైబిలు చదవాలి. ప్రతిచోటా ఆమెను పురుషుని ఆస్తిగా పరిగణించడం జరిగింది. ఏ క్షణానైనా కోపం వస్తే త్యాగపత్రం రాసి ఇస్తాడు భర్త. అప్పుడామే అతని పిల్లల తల్లి - ఇల్లు లేనిది, కుటుంబంలేనిది అవుతుంది. క్రైస్తవ మతంలో స్త్రీల గురించి వివిధ అభిప్రాయాలు, నిర్వచనాలు వివరిస్తుంటే హృదయ విదారకంగా వుంటాయి. నేను పెళ్లాడదలిస్తే రాతిలోంచి విధేయతకల స్త్రీని సృష్టిస్తా. ఎందుకంటే స్త్రీలలో విధేయత వుంటుందనే ఆశ నాకు లేదు'' అన్నాడు. ప్రొటెస్టెంటు మతనిర్మాత సెయింట్ లూధర్. అలాగే 'స్త్రీత్వం అంటే కొనసాగుతూన్న శైశవమే'' అన్నాడు ఆగష్టుకామ్. క్రైస్తవ భర్తకు భార్య సాంగత్యాన్ని కోరే హక్కు ఎప్పుడుపడితే అప్పుడున్నదన్నారు మేరిస్టోప్స్. బైబిలు పాత నిబంధన పది ఆజ్ఞలలో (Ten Commandments) పదవ ఆజ్ఞలో స్త్రీలను పరిచారికలతో పెంపుడు జంతువులతో సమానంగా నిర్దేశించారు.

## స్త్రీ పురుషుడి ఆస్తి

స్త్రీని పురుషుడి ఆస్తిగా - ఎద్దులు, గాడిదలు, ఇల్లు, పొలంతో సమానమని చెప్పాడు. పురుషుని పతనానికి కారణం స్త్రీ. "ప్రపంచంలో ఆమె వల్లనే పాపం ప్రవేశించింది' 'ఆమె అపరిశుద్ధ కనుక దూరంగా వుంచుము అని బోధ చేశాడు పౌల్. ఇంకా హోదా గురించి చెప్పాలంటే తండ్రి తన కుమార్తెను దాసిగా అమ్మవచ్చును. "ఒకడు తన కుమార్తెను దాసిగా అమ్మిన ఎడల దాసులైన పురుషులు వెళ్లిపోవునట్లు ఆమె వెళ్లిపోగూడదు. (నిర్గమ 21:7) అమ్మివేసితిని? (యెషయా 50:1) "నీవు హెబ్రీయుడైన దాసుని కొనిన ఎడల వాడు ఆరు సంవత్సరములు దాసుడైయుండి ఏడవ సంవత్సరమున ఏమియు ఇయ్యకయే నిన్ను విడిచి స్వతంత్రుడగును'' (నిర్గమ 21:2) పురుషునికి ఆరు సంవత్సరములకు విముక్తి, స్త్రీకి దాస్యం నుండి విముక్తి లేనేలేదు. ఇది క్రైస్తవం స్త్రీకి (తొలినాటి క్రైస్తవం) ప్రసాదించిన వరం. కనుక క్రైస్తవ స్త్రీల హోదా చాలా విచారకరంగా

వుంది.

## ముస్లిం స్త్రీల హోదా

జనాభాలో సగం మందిగా వున్న స్త్రీలు దైన్యంలో, నైచ్యంలో మునిగివుంటే సమాజ ప్రగతి అనేదానికి అర్థం లేదు. కనుక విశేషవ్యాప్తి, ప్రాచుర్యం కలిగిన ఇస్లాం మతాన్ని అనుసరించేవారిలో స్త్రీల స్థితి ఎలా వున్నదనేది విచారణీయాంశం. అంతేగాక భారతదేశంలో నూటికి పదకొండుమంది ముస్లింలు వున్నారు. అంటే మతదృష్ట్యా అల్పసంఖ్యాక వర్గంలో అగ్రశ్రేణిలో వున్నారన్నమాట. అలాంటి భారత ముస్లింలలో స్త్రీల స్థితి ఎలా వుందో గమనించటం. మహిళోద్యమ కార్యకర్తలకేకాక, మానవ సంక్షేమాన్ని ఆకాంక్షించే వారందరికీ అవశ్యకర్తవ్యం.

## స్త్రీ, పురుష విభాగాలు

ముందుగా స్త్రీల వేర్పాటు, విధానపు క్రమానుగత పరిణామాన్ని గురించి తెలుసుకోవటం అవశ్యకర్తవ్యం. ఇంటిలో వేర్పాటు స్త్రీలు నివశించేభాగం. పురుషులు నివసించే భాగం వేరుగా వుంటాయి. గృహంలో కూడ స్త్రీ తన పురుషబందుగులు- మామ, బావ, మరిది, కుమారుడు, అన్న, తమ్ముడు మొదలైనవారి ఎదుట నడయాడే తీరులో గమనార్హాలు. ఇల్లుదాటి ఆమె వెళ్లవలసివస్తే వెళ్లతగిన ప్రదేశాలు వేరుగా వుంటాయి. ఇల్లుదాటి ఆమె వెడలినప్పుడు ఆమె వేషధారణ, ఆమెకు తోడు, అనివార్యం. పరపురుషులు తన పురుష బంధువులకోసం వచ్చినపుడు ఆమెకాని, వచ్చిన వారుకాని సంచరించవలసిన పద్ధతి - తలుపు చాటునుండి సమాధానం చెప్పడం వగైరాలు. ఆమె చేపట్టదగు వృత్తులు-నర్సింగు, టైపింగు, టీచింగు, గృహాలంకరణ, హోమ్‌సైన్సు లాంటివి కొన్ని మాత్రమే. ఆమె అంతస్తు, హోదా పురుషుని హోదాతో పోలిస్తే చాలా తేడాలుంటాయి. ఇలా ఎన్నో మరెన్నో చెప్పవచ్చు. "సంతానం కనే వయస్సు దాటి స్త్రీలు వివాహమాడే అవకాశం, ఆశలేని పరిస్థితులలో తమ అలంకారాలను బహిర్గతం చేయని విధంగా తాము కప్పుకునే వస్త్రాలను ధరించుకున్నా పాపంలేదు. అయినా కప్పుకున్న వస్త్రమును త్యజించకుండుట ఆమెకు మేలు" 'సురా 24, ఆయత్ 60)"

## భార్యలు ప్రసంగించే పద్ధతి

ప్రవక్త భార్యలను ఏమైనా అడగదలిస్తే తెర అవతలనుండి అడగండి. అది మీ హృదయాలకు ప్రవక్త భార్యల హృదయాలకు మంచిది" (సురా 33 ఆయత్ 53)" తమ తండ్రులతో, కుమారులతో, సోదరులతో, సోదర కుమారులతో, అక్కచెల్లెళ్ల కుమారులతో,

పై చెప్పినవారి స్త్రీలతో, బానిసలతో భార్యలుగా ఉన్న స్త్రీలు స్వేచ్ఛగా ప్రసంగించటం పాపంకాదు" (సురా 33 ఆయత్ 55) "ఇంటి నుండి బయటికి వెళ్లేటప్పుడు తాము కప్పుకునే వస్త్రమును బాగా దగ్గరకు లాక్కోమని మీ భార్యలకు, కుమార్తెలకు విశ్వాసులైన స్త్రీలకు చెప్పవలసినది. అది శ్రేయస్కరం. ఎందుకంటే వారిని గుర్తుపట్టని నిమిత్తమున్నూ, వారికి చికాకు కలుగజేయకుండాను" (సురా 33 ఆయత్ 59) ప్రవక్త ఆచారాలు ఇతరులకు ఆమోదయోగ్యాలు; ఆయన మాటలు శిరోధార్యాలు. కుటుంబంలోని దగ్గర బంధువులకు తప్ప ఇతరులకు ఆమె అలంకారాలను చూపరాదు. పురుషులు, స్త్రీలు క్రిందికిచూస్తూ మాట్లాడవలెనే కాని చూపులు కలిపి మాట్లాడరాదు. స్త్రీలు తమ వక్షస్థలాలను కప్పుకోవలెను. వివాహిత స్త్రీ స్వేచ్ఛగా మాట్లాడదగు బంధువర్గపు పురుషుల జాబితా చెప్పబడింది. వివాహిత స్త్రీతో పరపురుషుడు మాట్లాడవలసివస్తే తెర అవతల నుండి మాట్లాడవలెను. పిలుపుకు జవాబు లేకపోయినా, తిరిగి పొమ్మన్నా పరాయి పురుషుడు ఇంటిలోకి అడుగుపెట్టరాదు. స్త్రీలు తిరిగే భాగానికి పురుషులు తిరిగే భాగానికి మధ్య ఇంటిలో దట్టమైన తెర అవసరమయింది.

## సిక్కుల ధర్మశాస్త్రం

సిక్కులు తాము ఒక మతానికి చెందివున్నాం. కనుక తమకు మతపరమైన శాసనం (personal law) కావాలని అలజడి చేస్తున్నారు. దాన్ని న్యాయసంబంధమైన మంత్రిత్వశాఖచేత పరిశీలింపచేస్తానని ఆనాటి ప్రధానమంత్రి హామీ యిచ్చారు. ఈ చిత్తు శాసనం చట్టరూపమైతే శిక్కు స్త్రీల గతి ఇరాన్, పాకిస్తాన్ స్త్రీల స్థితికన్నా ఘోరంగా మారుతుంది. ఇలా వారిని అన్యాయం చేసేకన్నా వారిని పుట్టగానే హతమార్చడం న్యాయమేమో! అనే అభిప్రాయాలు కూడా వచ్చాయి. కనుక సిక్కు స్త్రీలు, ముఖ్యంగా భారత స్త్రీలు ఆఖరికి అకాలీ పార్టీవారు చిత్తుశాసనంలోని లోపాలను ప్రజల దృష్టికి తెచ్చి వివరిస్తే చిత్తు శాసనములోని ముఖ్య లక్షణాలు అర్థమవుతాయి.

## సిక్కు స్త్రీకి మధ్యయుగ నిబంధనలు

అందులో బహుభార్యాత్వం, వారసత్వలోపాలు, విడాకులు, భరణం లాంటివే కాక 'చదరండాజీ' లేక 'క్రేవా (ఆచారం ప్రకారం ఆమెకు వైధవ్యం వస్తే మామగారి తతిమ్మా కుమారులలో ఒకని భార్యగా జీవించవచ్చును) లాంటి తిరోగమన భావాలు అనేకం ఆ చిత్తులో దర్శనమిస్తాయి. ఆ చిత్తు శాసనాలు చట్టరూపం తాలిస్తే సిక్కు స్త్రీలు మధ్యయుగాలనాటి పరిస్థితికి పూర్తిగా నెట్టబడతారు. కనుక వాటిని సమీక్షిద్దాం. సిక్కుమతం

మాత్రమే స్త్రీలకు సమానహోదా యిచ్చిందని తమ దృక్కోణం నుండి డా॥ అత్తార్‌సింగు అభిప్రాయం వెలిబుచ్చాడు. అకాలీల మతనాయకుడు గుర్‌నామ్‌సింగ్‌తిర్ స్త్రీల శ్రేయస్సును తాము విస్మరించటం లేదంటూ తన సిద్ధాంతాలనిలా సూత్రీకరించాడు.

## భర్తను ప్రశ్నించరాదు

"ఆమె భర్త కోరికలను మన్నించాలి. అతనిని ఆమె ప్రశ్నించడం మొదలుపెడితే ఆమెన్ను భర్త బజార్లోకి నెట్టవచ్చును", సిక్కు స్త్రీలు పురుషులపై ఆధారపడి బ్రతకాలి' ', "బ్రతికినంతకాలం నీతివంతులు బ్రతికినట్లు పెద్దలచే రుజువు చేసుకోవాలి", "మద్యం త్రాగడం, జుట్టు కత్తిరించుకోవడం, సిగరెట్లు త్రాగడం స్త్రీలపరంగా నేరం, "వివాహమైన 2 సం॥లు పూర్తి అయిన తర్వాతనే, ఉభయులు సమ్మతిమీదనే విడాకులు పొందవచ్చును. కాని పంచాయతీదార్లు సామరస్యాన్ని సాధించటానికి చేసిన ప్రయత్నం విఫలమైతేనే ఆ అవకాశం వుంటుంది". "ఆమె నడవడిని, నీతిని, న్యాయస్థానాలు నిర్ణయించరాదు. అయిదుగురు పంచాయతీదార్లు తేలుస్తారు. అందులో ఇద్దర్ని ఆమె, ఇద్దర్ని భర్త ఒకర్ని ఇద్దరూ కలిసి ఎన్నిక చేసుకోవాలి. పంచాయతీదార్ల తీర్పువల్ల అసంతృప్తి చెందితేనే వారు కోర్టుకు వెళ్లవచ్చు." అవివాహిత స్త్రీని ఆమె కోరినంతకాలం తల్లిదండ్రులు, సోదరులు పోషించాలి. 'విధవలకు మామూలుగా భర్త ఆస్తిలో సగం వస్తుంది. కాని ఆమె వ్యభిచారిణి అని అత్తమామలు రుజువు చేయగానే ఆ హక్కు పోతుంది. లేక ఆమె మళ్లీ పెళ్లాడినా భర్త నుండి వచ్చిన వాటా ఆస్తి పోతుంది. అవి మచ్చుకు కొన్ని మాత్రమే. ఈ సూచనలన్నీ పురుషాధిపత్యాన్ని సూచిస్తున్నాయి. ఈ సూచనలలో స్త్రీ పురోభివృద్ధిని, స్త్రీ స్వేచ్ఛాసమానత్వాన్ని, ఆమె వ్యక్తిత్వాన్ని కాంక్షించేవి దరిదాపు శూన్యం.

## జైన, బౌద్ధాలలో

హిందూ, ముస్లిం, క్రైస్తవ, పార్శీ మతాలకన్నా జైనం, బౌద్ధం స్త్రీలయెడ కరుణ, దయ సానుభూతి ప్రకటించాయి. కాని బుద్ధుడు సైతం మొదట్లో స్త్రీలకు సన్యాసార్హత నిరాకరించాడు. స్త్రీలు తమకూ మోక్షాన్ని ప్రసాదించమని కోరినప్పుడు స్త్రీల ప్రవేశం వుంటే వెయ్యేళ్లు మనగలిగిన మతం 500 ఏళ్లకంటే బౌద్ధం జీవించలేదని ఆనందుడు బుద్ధునితో వాదించాడు. బుద్ధుడు కొన్ని నియమాలు ప్రకటించాడు. స్త్రీలను ఎంతో అవసరమైతే తప్ప చూడవద్దని, మాట్లాడవద్దని చర్చలకు దిగవద్దని, మరీ తప్పకపోతే మహా జాగ్రత్తగా మెలగమని బోధించాడు. స్త్రీల రాకపోకలతో దుఃఖాన్ని కాని ఆనందాన్ని

కాని పొందని ధీరుడే అసలైన జ్ఞాని అనికూడా అన్నాడు బుద్ధుడు.

## నిర్లక్ష్య ధోరణిలో స్త్రీ సమస్య

పురుషులతో సరాసరి మాట్లాడరాదని, మధ్యవర్తుల ద్వారా తమ సమస్యలుకాని, అవసరాలు కాని తెలియజేయాలని ప్రవచించాడు బుద్ధుడు. ఆకర్షించువాడుంటే, అవకాశం దొరికితే, విషయాన్ని రహస్యంగా వుంచబడితే స్త్రీ కూడా తప్పుచెయ్యటానికి వెనుకాడదు అన్నాడు "మిళిదంపాన"లో "ఆడవారి హృదయాలు చాలా లోతైనవని, వారి ప్రవర్తనను తెలుసుకోలేమని, ఎంతో చాకచక్యంగల దొంగలవంటి వారని, వారు అబద్ధాన్ని దాచగలరని, నిజాలను చెప్పరని, అందువల్ల వారి ఇష్టా ఇష్టాలను లక్ష్యపెట్టవద్దని' ' "మిళిందపాన"లో స్త్రీలను గురించి చెప్పాడు గౌతమబుద్ధుడు.

భారతదేశంలో బౌద్ధులు, జైనులు కూడా క్రీస్తు పూర్వం 6వ శతాబ్దానికి చెందినవారే. అందులో జైనుల్లో రెండు తెగలవారున్నారు. శ్వేతాంబరులు, దిగంబరులు. స్త్రీలు దిగంబరంగా వుండాలనేది దిగంబర శాఖవారు. అయితే తెల్లని వస్త్రాలు వేసుకోవచ్చని శ్వేతాంబరులు ధృవీకరించారు. అలాగే స్త్రీ మోక్షానికి అనర్హులాలని దిగంబరులు సూత్రీకరిస్తే మోక్షానికి అర్హులాలని శ్వేతాంబరులు వాదించారు. క్రీ.పూ. 5వ శతాబ్దంలో జైనుల్లో కొందరు పిల్లలనూ, తల్లులను వదిలేసి సన్యాసుల్లో కలిసిపొయ్యేవారు. అక్కడక్కడా ఆడవారు సైతం సన్యాసత్వం స్వీకరించినట్లు ఆధారాలున్నాయి. కాని జైన సన్యాసిని జైన సన్యాసి కంటే తక్కువ అనే విషయాన్ని శ్వేతాంబర, దిగంబరులిద్దరూ అంగీకరించేవారు. హిందూ స్త్రీకి వేదాధ్యయనం నిషేధమయినట్లే జైన శ్వేతాంబర మూలగ్రంథం "ఆంగ" మహిళలు పఠించరాదని నిషేధించారు జైనులు.

## స్త్రీ హృదయం క్రూరత్వమట!

జైన స్త్రీల్లో వేశ్యలు వుండేవారని వారిని జైన సన్యాసులు లోబరుచుకునేవారని "వ్యవహార భాస" గ్రంథంలో వ్రాశారు. రాజులకు హెచ్చుస్థాయిలో భార్యలుండేవారు. ఆ రాణులంతా పరదాలో వుండేవారు. స్త్రీలకు కాళ్లు, చేతులు నరికినా ఆమెను నమ్మవద్దని, వాళ్ళను చూచినా, తాకినా నిగ్రహం పోతుందని, వాళ్లు నిజాయితీలేని వాళ్లు కనుక దూరంగా వుంచాలని జైనమతస్తులు శాసించారు. "జైన స్త్రీల హృదయాలు లోతైనవని వారు దేవతలను కూడా మోసగిస్తారని, జె.సి.జైన్ వ్రాశాడు. స్త్రీలు అబద్ధాలాడటమేకాక వాటిని నమ్మిస్తారు; ఏడుస్తారు? ఏడిపిస్తారని, మాటల్లో, చూపుల్లో లావణ్యం, హృదయంలో క్రూరత్వం గలవారని కూడా జె.సి.జైన్ చెప్పాడు. ఏది ఏమైనా

జైన, బౌద్ధ మతాలు కూడా స్త్రీని చులకనగానే చూశారనేదానికి నిదర్శనాలు చాలా వున్నాయి.

## ఛాందసత్వాన్ని ఎదుర్కోవడం

కేవలం ప్రబోధం, సాహిత్యం, ఉపన్యాసాల ద్వారా మత ఛాందసత్వాన్ని ఎదుర్కోలేము. రూపుమాపలేము. సామాజిక ఆచరణలో మతఛాందసం స్త్రీలను ఎలా కించపరుస్తున్నదో, ఎలా వెతలపాటు చేస్తున్నదో దానికి లోనయిన స్త్రీలకు తెలియజెప్పాలి. వారికి తమదైన స్థితిని గురించి స్పృహ కల్గించాలి. అపుడు వారు తాము స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు హక్కుదారులమేనని ఆలోచిస్తారు. దాంతో మత ఛాందసత్వంపై వారు తిరగబడతారు. అందరి మతాలను ముఖ్యంగా అల్పసంఖ్యాక మత సంస్కృతిని రక్షించాలనే అభిప్రాయంలో మత సమాజాల తీరుతెన్నులను సమర్థించడం అనుచితం. అలా చేస్తే స్త్రీలకు అన్యాయం చేసినట్టవుతుంది. జమీందారీ విధానం, పెట్టుబడిదారీ విధానం, పురుషాధిపత్యం, మతఛాందసం స్త్రీలకు ప్రధాన శత్రువులు. పురుషాధిపత్యాన్ని మత ఛాందసత్వం సమర్థిస్తూ బలపరుస్తున్నది. కనుక మత ఛాందసత్వాన్ని ప్రప్రధాన శత్రువుగా పరిగణించి స్త్రీలు పోరాడవలసిన అగత్యం ఎంతయినా వుంది. మత ధర్మశాసనాలను ఉనికిని వ్యతిరేకించవలసిన అవసరం కూడా ప్రబలి వుంది. స్త్రీల హోదా కమిటీ నివేదిక దేశాన్ని, ప్రజలను అందులో ముఖ్యంగా స్త్రీలకు యీ అంశంపై ఇరువది యేండ్లనాడే హెచ్చరించిందని మరచిపోరాదు.

## స్త్రీలు చైతన్యం పొందాలి

మత ఛాందసత్వాన్ని స్త్రీలు ఎలా ఎదుర్కోవాలి? అన్నపుడు మున్ముందుగా మతఛాందసత్వం స్త్రీలను ఎన్ని అష్టకష్టాలపాలు చేసిందో స్త్రీలు గ్రహించాలి. అధికసంఖ్యాక స్త్రీలు ఆ అంశాన్ని గుర్తించేలా అభ్యుదయగాములు, జాగృతి, చైతన్యం కల స్త్రీలు ప్రయత్నించాలి. అజ్ఞానంలో అవిద్యతో కొట్టుమిట్టాడే సామాన్య స్త్రీలకు యీ విషయంలో సాయపడాలి. ముఖ్యంగా మనది సెక్యులర్ స్టేటు కనుక సర్వులకూ వర్తించే కామన్ సివిల్ కోడ్ వెంటనే ప్రవేశపెట్టాలి. ఆనాడే స్త్రీలలో ఐక్యత కలిగి తమ హోదాను పెంచుకొని, తమ సంకెళ్లను త్రెంచుకొని వ్యక్తిత్వాన్ని నిలపుకుంటారు. దానికి ముందుగా రావాల్సింది అన్ని మతాల స్త్రీలలో ఐక్యత. ఆ పరిస్థితి అతి త్వరలో రాగలదని ఆశించటం అసమంజసం కాదేమో!

# ప్రాచీన భారతీయ నాగరికత సంస్కృతుల ప్రాతిపదికలు

- కీ॥శే ఎస్.జి. సర్దేశాయి

(గత సంచిక తరువాయి)

"భారతీయ నాగరికత ఎలా వుండేది?" "భారతీయ సంస్కృతి ఎలా వుండేది? "ఈ నాగరికత యొక్క అసలు స్వరూపం ఏమిటి?" చిట్టచివర మనం ఈ ప్రశ్నల్ని గూర్చి ఆలోచించాలి.

అనేక కారణాలచేత ఈ ప్రశ్నలకు జావాబు చెప్పటం చాలా కష్టం.

మొదటిది: "నాగరికత" "సంస్కృతి" అన్న మాటలు చాలా క్లిష్టమైనవి. జీవితంలోని అనేక విషయాల్ని అవి తమ పరిధిలోకి తీసుకుంటాయి.

రెండవది: ఈ భావాలు చాలా సూక్ష్మమైనవి, చేతికి చిక్కనివి, వాటిని నిర్వహించాలని, మాటలతో పట్టుకోవాలని ప్రయత్నిస్తే అవి మన చేతుల్లోంచి జారిపోతాయి.

## అన్ని నాగరికతలకు ఆధార భూతమైనది-భౌతిక సారం

మూడవది: వీటిలో ఎంత సూక్ష్మతవున్నా, అన్ని నాగరికతలకూ నిశ్చితమైన, ఆధారభూతమైన భౌతిక సారం వుంటుందన్న విషయాన్ని మరచిపోకూడదు. ఆ విషయాన్ని మనం మరచిపోతే అందమైన, పనికిమాలిన సిద్ధాంతాలను మాత్రమే రూపొందించగలం.

అవి ఎందుకు పనికిమాలినవంటే అవి మాయచేయటానికి దారితీస్తాయి. "భారతదేశపు గొప్పదనం" తలుచుకొని ఒళ్ళు తెలియని పారవశ్యం అనుభవించే వారు ఇలాంటి మాయలోనే వున్నారు. భారతీయ నాగరికతను అలా నిర్వచిస్తే భారతీయ ఆధిక్యతావాదాన్ని, భారతీయ అహంకారాన్ని ఆమాటకొస్తే భారతీయ దురహంకారాన్ని)

నిస్సందేహంగా ప్రోత్సహించిన వాళ్ళమవుతాం.

నాలుగవది: ప్రాచీన నాగరికతలు ఎన్ని ఘనవిజయాలు సాధించినా అవి పీడకవర్గాల నాగరికతలన్న సత్యాన్నీ విస్మరించటానికి వీలులేదు. అవి ప్రపంచ చరిత్రకు అలాగే దోహదం చేశాయి. కానీ శ్రమజీవుల్ని పీడించడంలో, అణగద్రొక్కటంలో అవి గొప్ప పాత్రను నిర్వహించాయి. ఆ నాగరికతల్లో సమాజంలోని తక్కువవర్గాల వారిపట్ల తీవ్రమైన అసహ్యం, అమర్యాద స్పష్టంగా కనిపిస్తాయి. వాటిలో కలిగినవాళ్ళకొక నీతి, లేనివాళ్ళకొక నీతి కనిపిస్తాయి. ఒకే సూత్రం లేదా భావం పాలకులకొక రీతిలో పాలితులకు అందుకు వ్యతిరేకమైన రీతిలో ఉపయోగించబడింది.

ముళ్ళపొదల వంటి ఇలాంటి ఇబ్బందుల ద్వారానే ఎవరైనా ప్రాచీన భారతీయ నాగరికత "ఆత్మను, సారాన్ని పట్టుకోవటానికి" ప్రయత్నించాలి.

## ఉపనిషత్తుల కాలంలో రూపొందిన నాగరికతే ప్రధానమైంది

భారతీయ నాగరికత అంటే నా దృష్టిలో "ప్రధానమైన" నాగరికత అని స్పష్టం చేయవలసివుంది. ఇది ఉపనిషత్తులలో రూపం దాల్చటం ప్రారంభించి గుప్తుల కాలానికి ఉన్నత శిఖరాగ్రాలకు చేరుకున్న నాగరికత. దీనితో విభేదించిన, దీన్ని వ్యతిరేకించిన ధోరణులను ఇందులో చేర్చటంలేదు.

"భౌతిక జీవితానికి సంబంధించిన ఉత్పత్తి విధానం సామాజిక, రాజకీయ బౌద్ధిక జీవితానికి సంబంధించిన సాధారణ సరళిని నిర్దేశిస్తుంది. ఒక వ్యక్తి తన్నుగురించి తాను ఏమనుకుంటున్నాడన్న విషయం ఆధారంగా మనం అతణ్ణి గురించి ఒక అభిప్రాయం ఏర్పరచుకోము. అలాగే ఒక సంధియుగాన్ని గురించి ఆ యుగంలో కనిపిస్తున్న చైతన్యం ఆధారంగా తీర్పు చెప్పలేము. ఇది మరో రకంగా జరగాలి. భౌతిక జీవితంలో కనిపిస్తున్న వైరుధ్యాలను (సామాజిక ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య ఉన్న వైరుధ్యాలను) ఆధారం చేసికొని చైతన్యాన్ని వివరించాలి. తనకోసం రూపొందించుకున్న ఉత్పత్తిశక్తులు సంపూర్ణంగా వికసించకుండా ఏ సామాజిక వ్యవస్థాపతనం కాదు. పాత సమాజంలో భౌతిక పరిస్థితులు పక్వం కాకుండా మెరుగైన కొత్త ఉత్పత్తి సంబంధాలు పాత ఉత్పత్తి సంబంధాలను తోసివేసి ఆ స్థానాన్ని ఆక్రమించవు' ' (ఉపోద్ఘాతం 1 "ఎ కాంట్రిబ్యూషన్ టు ది క్రిటీక్ ఆఫ్ పొలిటికల్ ఇకానమీ". పు. 20.21 ప్రోగ్రెస్ ప్రచురణలు, 1970).

## నాగరికత, సంస్కృతుల ఉపరితల సారాంశం

ప్రాచీన భారతీయ సమాజంయొక్క భౌతిక పునాదిని గురించి, అందులో సుదీర్ఘమైన కాలంలో చాలా. నెమ్మదిగా వచ్చిన మార్పుల్ని గురించి ఇంతకుముందే తెలుసుకున్నాం. ఇప్పుడు "నాగరికత", "సంస్కృతి" అన్న పదాల ఆధారంగా మొత్తం ఉపరితలం యొక్క ఆత్మను, సారాన్ని పరిశీలించబోతున్నాం.

ఈ నాగరికత, సంస్కృతి భారతీయ సమాజాన్ని సంఘటితపరచి, దాదాపు మూడువేల సంవత్సరాల కాలం ఒక క్రమపద్ధతిలో నడిపించటంలో చారిత్రాత్మక పాత్రను నిర్వహించాయనటంలో సందేహం లేదు. ఎంత మార్పు లేకుండా వున్నా (మరింత బాగా చెప్పాలంటే -- కనిపించకుండా మార్పు చెందుతున్నా) కులం, గ్రామీణ వ్యవస్థ తప్పకుండా సామాజిక వ్యవస్థలే. అవి శతాబ్దాలపాటు కొనసాగాయికూడా. అంతకాలం కొనసాగటానికి వీలు కలిగించిన సైద్ధాంతిక, సాంస్కృతిక ఉపరితలానికి (నాగరికతకు) చారిత్రక విలువ, చారిత్రక అవసరం వుండితీరాలి. లేకుంటే ఆ నాగరికత చారిత్రక రంగస్థలం మీదనుంచి అదృశ్యమైపోయి, కాలగర్భంలో కలిసిపోయి వుండేది. ప్రాచీనులు ధర్మాన్ని (మతాన్ని) గురించి ఆలోచించిన పద్ధతి చాలా విశాలమైనది. "ధారయతి ఇతి ధర్మః" (సమాజానికి) ఆధారభూతమైంది, సమాజాన్ని సంఘటిత పరిచేది) అని ధర్మాన్ని మన మత గ్రంథాలు అభివర్ణిస్తున్నాయి. "ధర్మోరక్షితి రక్షితః" అన్న వాక్యంకూడా ఇదే విషయాన్నే చెపుతుంది. సమాజం ధర్మాన్ని రక్షిస్తే, ధర్మం సమాజాన్ని రక్షిస్తుందని ఈ వాక్యానికర్థం.

## భారతీయ సంస్కృతి ఆధ్యాత్మికతకు ఎక్కువ ప్రాధాన్యం యిచ్చిందా?

ప్రత్యేకతలుగా పరిగణించబడే భారతీయ నాగరికతా లక్షణాలేవి? భారతీయ సంస్కృతి భౌతిక జీవితానికంటే ఆధ్యాత్మిక జీవితానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చిందన్నది మొట్టమొదటి వాదం. భౌతిక జీవితం ఆధ్యాత్మిక జీవితాన్ని (మోక్షాన్ని) సాధించటానికి సాధనం. జీవితలక్ష్యం మాత్రమే. అది మార్పులేని ఆనందమయమూ, శాశ్వతమైన సమచిత్తత్వం. మిగిలినవన్నీ ఆశాశ్వతమైనవి. ప్రాథమికంగా అవన్నీ మాయ. అందుచేత దైనందిన జీవిత వ్యవహారాలను అనాసక్తితో నిర్వహించాలి. ఆత్మమాయను తొలగించుకొని భౌతిక సంబంధాలనుంచి విముక్తిని సాధించాలి. అలాంటి స్థితి వచ్చినప్పుడు ఆత్మబ్రహ్మలో (పరమాత్మలో) లీనం అవుతుంది. అదే మోక్షం.

మోక్షమంటే విముక్తి. కానీ "హిందూ జీవితపద్ధతి"లో దానికున్న అర్ధాన్ని స్పష్టంగా తెలుసుకోవాలి. ఇక్కడ భావవాద అభౌతిక భావాలైన ఆత్మ, బ్రహ్మలు హైందవ మతశాస్త్ర భావమైన విముక్తితో కలగాపులగమైపోయాయి. పరిశుద్ధ అభౌతిక శాస్త్రంలో ఆత్మవ్యక్తికి సంబంధించిన అంతిమ సత్యం. బ్రహ్మ విశ్వానికి సంబంధించిన అంతిమ సత్యం. రెండూకూడా రూపరహితమైనవి, నిర్గుణమైనవి, చలనం లేనివి. అంతేకాక ఆత్మ, బ్రహ్మ అచింత్యమైనవి, అనిర్వాచ్యమైనవి, లోతుగా ఆలోచిస్తే రెండూ ఒకటే. ఇది భౌతిక శాస్త్రం.

ఈ అభౌతిక సిద్ధాంతాన్ని మతశాస్త్రం నుంచి తార్కిక పద్ధతిలో వేరు చేయటానికి అవకాశం వుంది. కానీ ఈ సిద్ధాంతం అలా అభివృద్ధి చెందలేదు. వ్యక్తి ఆత్మ భవబంధాల నుంచి విముక్తి పొంది విశ్వాత్మలో లీనం కావటం ముక్తి, మోక్షం, వ్యక్తి ఆత్మవిశ్వాత్మలో లీనం కావటాన్ని మోహమనటం మతశాస్త్ర ప్రభావం.

మోక్షం మోక్షంగా వుండాలంటే అది చరమదశగా వుండాలి. అందుచేత బ్రహ్మను శాశ్వతమని, స్థిరమని పరిణామ రహితమని వర్ణించటంలో ఆశ్చర్యంలేదు. అంతేకాకుండా అది సత్యమని, శివమని, సుందరమని సత్, చిత్, ఆనందమని వర్ణించబడింది.

## చైతన్యం అంటే ఏమిటి?
## మనమత గ్రంథాలవైఖరి

మన మత గ్రంథాల్లో చైతన్యం అంటే అర్థమేమిటో ఈసందర్భంలో మనం తెలుసుకోవాలి. వ్యక్తి తన అంతిమ సత్యం ఆత్మ అనీ, అది బ్రహ్మకు అభిన్నమైందనీ తెలుసుకోవటమే చైతన్యం. ఇలాంటి చైతన్యమే జ్ఞానం. ఇతర భావాలు, నమ్మకాలు అజ్ఞానం, అవన్నీ కూడా మాయ, వంచన, అంధకారం, కాబట్టి మోక్షం అంటే నిజమైన జ్ఞానాన్ని పొందే స్థితిని చేరుకోవటం కూడా.

ప్రాచీన భారతీయ నాగరికతలో జీవితానికి అర్థం, ప్రయోజనం అంతిమ సత్యంతో సంబంధం అలా వుండేవి.

ఈ జీవిత దృష్టి నిర్లిప్తమైన శాంతిని, కాలాతీత మనస్తత్వాన్ని, బయటి అలజడులకు, చలించని మనశ్శాంతిని, సంతృప్తిని కలిగి వున్న నాగరికతను, వాతావరణాన్ని సృష్టించగలదన్నవాదంతో చెట్టపట్టాలు పట్టుకొని అభివృద్ధి చెందింది. ఈ విషయాన్ని అర్థం చేసుకోవటం కష్టంకాదు. కానీ ఈ జీవిత దృష్టి భారతీయులకొక నాజూకుతనాన్ని

రీతిని, సభ్యతను యిచ్చింది. దీనిని కాదనలేము. భారతీయుల్లోని ఈ గుణాలనే మార్క్స్ ఎంతో అందంగా వర్ణించాడు. ఈ జీవిత దృష్టి జీవితానికొక ప్రయోజనాన్నిచ్చి, అర్థవంతం చేసింది.

## పునర్జన్మ సిద్ధాంతంతో ముడిపడి వున్న "మోక్ష" సిద్ధాంతం

ఈ మోక్ష సిద్ధాంతం కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలతో ముడిపడి వుంది. ఈ సిద్ధాంతం ప్రకారం ఈ జన్మలో మానవుని పరిస్థితి (అంటే బ్రాహ్మణుడుగానో, క్షత్రియుడుగానో, వైశ్యుడుగానో, శూద్రుడుగానో, అంటరానివాడుగానో పుట్టటం) అతని సుఖదుఃఖాలు అతడు పూర్వజన్మల్లో చేసుకున్న పాపపుణ్యాల మీద ఆధారపడి వుంటాయి. ఇలా మతశాస్త్ర సిద్ధాంతమైన మోక్షం చాతుర్వర్ణ వ్యవస్థ నిర్వహణతో, వర్గ కుల వ్యవస్థతో దగ్గర సంబంధాన్ని కలిగివుంది. చాతుర్వర్ణ వ్యవస్థ ఆదేశించిన విధుల్ని తు.చ. తప్పకుండా కోరికలు లేకుండా (నిష్కామంగా) నిర్వహిస్తే రాబోయే జన్మలో పైకులంలో పుట్టి సుఖపడవచ్చునన్న భరోసా వుంది. అలాంటి పునర్జన్మలు అనేకం పొంది మానవుడు చివరగా మోక్షాన్ని పొందుతాడు.

కర్మ, పునర్జన్మ, మోక్షం సిద్ధాంతాలు కేంద్ర బిందువులు. హిందువుల జీవితం సామాజిక దృష్టి వీటి చుట్టూ పరిభ్రమిస్తూవచ్చాయి.

## ప్రాచీన భారతీయ నాగరికత ప్రత్యేక లక్షణాలు

ప్రాచీన భారతీయ నాగరికతకు మరికొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయని చాలామంది వాదిస్తారు. అవి విశాల దృక్పథం, సహనం, సర్దుబాటు, ఇమిడిక, అహింస, ఇవన్నీ కలిసి భిన్నత్వంలో ఏకత్వమనే చక్కని చిత్రం ఏర్పడింది.

ఈ లక్షణాలన్నీ కలసి మన సామాజిక వ్యవస్థను గట్టిపరిచాయని సుకరంగా కదలటానికి దోహదం చేశాయని మరోసారి చెప్పుకోవచ్చు. అవి భారతదేశాన్ని సజీవంగా వుంచాయి. వ్యవస్థీకరించబడ్డ అవిచ్ఛిన్నత చాలా ఎక్కువకాలం కొనసాగటానికి సహాయం చేశాయి. అంతవరకూ అవి నిశ్చితమైన చారిత్రక పాత్రను నిర్వహించాయి.

అవి ఏ సామాజిక వ్యవస్థలో నుంచి పుట్టాయో, తరువాత ఏ సామాజిక వ్యవస్థనైతే అవి సమర్థించి ఆమోదించాయో ఆ వ్యవస్థ దృష్టికోణం నుంచి వీటిని పరిశీలించుదాం. సామాన్య మానవుడు ఈ భావాలను ఎలా అర్థం చేసుకున్నాడో కూడా ఆలోచిద్దాం. ఎందుకంటే ఈ భావాలను అలా అర్థం చేసుకున్నవారు పాలకవర్గాలు

మాత్రమే. కాబట్టి అవి వస్తుగతమైనవని చెప్పటానికి వీలులేదు. ఈ భావాలను గురించి ఉన్నతవర్గాలవారి వ్యక్తిగత అంచనా వస్తుగతమైన వాస్తవానికి దగ్గరగా వుందా లేదా అన్న ప్రశ్నను దాటవేయలేము. వ్యక్తిని అంచనా వేయటానికి అతణ్ణి గురించిన అతని అభిప్రాయాలు పనికిరావు. అలాగే ఒక సమాజాన్ని గురించి అంచనా వేయటానికి ఆ సమాజం గురించి ఆ సమాజం అభిప్రాయాలు కూడా పనికిరావు.

మొదట "సంతృప్తి", "ప్రశాంతత", నిర్లిప్తమైన తాత్త్విక జీవిత దృక్పథం", "కాలాతీత భావన" -- వీటిని గురించి ఆలోచిద్దాం. ఇవి మార్పులేని, కదలికలేని, పునరావృత్తి స్వభావం కలిగిన సమాజంలో పుట్టిన మానసిక స్వభావాలు కావా? ఎక్కడైతే జీవిత వాస్తవికతలో మార్పు రాదో అక్కడ "ప్రశాంతత" మానవుని మనస్సుకు సహజలక్షణం అయిపోదా?

## ఏ భావ జాలానికి ఏ వ్యవస్థ ప్రేరణ యిచ్చింది?

అలాగే "సహనం", "సర్దుబాటు", "ఇమిడిక", "అహింస", "భిన్నత్వంలో ఏకత్వం" కూడా సామాజిక పరిణామంలోని విపరీతమైన నెమ్మదితనం, భౌగోళిక విస్తరణ తెచ్చిన ఫలితాలే. నేనిక్కడ సామాజిక వ్యవస్థ పరిణామాన్ని గురించి విస్తరణను గురించి మాత్రమే చెబుతున్నారు. అంతేకానీ రాజుల మధ్య జరిగిన రక్తపాతాన్ని గురించికాదు. భారతీయ నాగరికత అసంఖ్యాకమైన ఆదిమజాతులవారికి ఆహారసేకరణ విధానం నుంచి, వేట నుంచి ఆహారోత్పత్తి విధానానికి తీసుకువచ్చింది. ఇది చాలా నెమ్మదిగా వందలాది సంవత్సరాల కాలంలో జరిగింది. ఇందులో హింస బహిరంగంగా ఉపయోగించబడలేదు. వీరి నందరినీ బ్రాహ్మణాధిక్యత కలిగిన సంస్కృతి పరిధిలోకి తీసుకొని వచ్చినప్పుడు గిరిజన సాంప్రదాయాలు కొనసాగటానికి అనుమతించక తప్పలేదు. ఇదే మన "అహింస", "ఇమిడిక", "సర్దుబాటు", "భిన్నత్వంలో ఏకత్వం" సాధించగలిగిన శక్తి.

## వర్గ-కుల ఆధిపత్యానికి
## కర్మ, పునర్జన్మ సిద్ధాంతం సమర్ధన

ఇప్పుడు కర్మ-పునర్జన్మ-మోక్షసిద్ధాంతా లన్నింటి గురించి ఆలోచిద్దాం. హిందూసమాజంలో బ్రాహ్మణ-క్షత్రియుల వర్గ-కుల ఆధిపత్యానికి ఈ సిద్ధాంతం ఒక సమర్ధనగా ఉపయోగించబడుతోందని ఇంతకుముందే చెప్పాను. కాని గత మూడు వేల సంవత్సరాలుగా అది సామాజిక చైతన్యాన్ని మొత్తంగా తన ఆధీనంలో ఎలా ఉంచుతూ

ఉందో వివరించటం కష్టం. కానీ అది సామాన్య ప్రజానీకాన్ని మోసం చేయటానికికుపయోగించిన కిటుకో, గారడీనో అయి వుంటే వాళ్ళు చిటికలో దాన్ని పసిగట్టి, తిరస్కరించి ఉండేవారు. నిలకడగలిగిన సామాజిక సిద్ధాంతాలు (మత సిద్ధాంతాలు కూడా) అవి పుట్టిన సామాజిక - చారిత్రక దశతో సంబంధాన్ని కలిగి వుంటాయి. వాటి మన్నికకు, ప్రజలంతా దాన్ని అంగీకరించటానికి కారణం అదే. వివిధ అంశాలను ఒక సూత్రంతో కలుపుతూ, ఎక్కువ మందికి ఆమోదయోగ్యంగా ఉన్న భావజాలం లేకుండా ఏ సమాజమూ జీవించలేదు. "పాలకవర్గం భావాలే సమాజాన్ని పరిపాలించే భావాలు" అన్నాడు మార్క్స్. కానీ పాలక వర్గం ఆ సామాజిక వ్యవస్థను కనీసం సుమారుగానైనా సంతృప్తిపరుస్తూ నడుపుతున్నంతవరకే ఆ భావాలు పనిచేస్తాయని మార్క్స్ నొక్కిచెప్పాడు. పాలక వర్గానికి సంబంధించిన ఆర్థిక వ్యవస్థకూ, సామాజిక వ్యవస్థకూ కాలదోషం పడితే పీడితులూ, తాడితులూ ఆ భావాలను గట్టిగా సవాల్ చేస్తారు. ఇది భారతదేశంలో జరగలేదు.

## బానిసత్వానికి పునాది
## కుల, కర్మ, పునర్జన్మ సిద్ధాంతం

వంశ పారంపర్యంగా వచ్చే కులవ్యవస్థ, ప్రాచీన గ్రామీణ ఆర్థిక విధానం అందుకు కారణాలు. శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం చాలా తక్కువ స్థాయిలో ఉండటం, కులప్రాతిపదిక కలిగిన సామాజిక వ్యవస్థలో చలనం లేకపోవటం కారణంగా సామాన్య ప్రజానీకానికి ఈ లోకంలో సామాజిక-ఆర్థిక స్వాతంత్ర్యం లభించే ఆశ ఉండేది కాదు. అందుచేత వారికి జీవితం "మార్పులేని ప్రకృతి శాపం"గా మారిపోయింది. నడుములు విరిగి పోయే చాకిరీకి, తక్కువ సామాజిక స్థాయికి, వాస్తవిక (ఈలోకానికి సంబంధించిన) కారణాన్ని తెలుసుకోలేని సామాన్య ప్రజానీకం కర్మ, పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరించింది. ఆయుధ శక్తితో ప్రజల్ని బానిసలుగా మార్చితే వారికి తాము ఎలా బానిసలయ్యారో తెలుస్తుంది. కానీ వైశ్యులు, శూద్రులు సామూహిక బానిసలు కావటానికి వారు వైశ్యులుగా, శూద్రులుగా పుట్టటం తప్ప మరో కారణం లేదు. వారి దృష్టిలో కూడా వారు సామూహిక బానిసలే. కాబట్టి కర్మ, పునర్జన్మ తప్ప ఈ మాయను ఎవరు విప్పగలరు? అంతేకాకుండా అదే సిద్ధాంతం వారికి మెరుగైన భవిష్యత్తు ఉందన్న ఆశను చూపుతోంది. చివరకు మోక్షం ఉందని కూడా చెబుతోంది. కాబట్టి బానిసత్వం, అసమానత సహజమైనవి. మార్చటానికి వీలులేనివి. స్వాతంత్ర్యం ఉంది కాని ఈ జన్మలోకాదు. అనేక పునర్జన్మల

తరువాత అది లభిస్తుంది. ఈ కర్మ-పునర్జన్మ సిద్ధాంతం భారతీయ సమాజానికి కుబుసంలా సరిపోయింది.

## "విశాలభావాలు, సహనం" పాక్షిక దృష్టితో కూడినవే!

మన నాగరికత కున్నాయని చెబుతున్న విశాల దృక్పథాన్ని, సహనాన్ని కూడా కాస్త పరిశీలించాలి. మన నాగరికతలో బహిరంగంగా (తొలి ఆర్యుల్లో, తరువాత సామ్రాజ్య నిర్మాతల్లో తప్ప) అసహనం, హింస కనిపించని మాట నిజమే. శూద్రులు, అస్పృశ్యులు మొదలైనవారు తమ హద్దులు దాటకుండా ఉండి; సామాజిక, రాజకీయ పెత్తందార్లు వారికి నిర్దేశించిన పనులు చేస్తూ ఉంటే వారికి శారీరక హింస ఎదురయ్యేది కాదు. వారు తమ హద్దుల్ని దాటారంటే అదే సమాజం తీవ్రమైన అసహనాన్ని ప్రదర్శించేది. పాలకవర్గాల పవిత్ర ప్రాంగణాల్లో వాళ్ళు అడుగుపెట్టటానికి వీలులేదు. అంతేకాకుండా దైనందిన జీవితంలో కూడా దయాహీనంగా చూడబడ్డారు, అసహ్యించుకోబడ్డారు, అవమానింపబడ్డారు. దీనికి తోడు అధికారులు, రాజులు శిస్తు, కౌలు, లెవీలు వసూలు చేసుకోవటానికి శారీరక శిక్షను ఉపయోగించేవారు.

## దేవదాసి పద్ధతి, వ్యభిచారం హిందూమత వ్యవస్థలో భాగంకాదా?

బ్రాహ్మణులు తమంతకు తాముగా నిరాడంబర జీవితాన్ని స్వీకరించి, జీవించారని ఒక వాదం ఉంది. మొట్టమొదటగా, ఈ వాదానికొక సవరణ చెప్పాలి. కాశీ, మధుర, పూరీ మొదలైన యాత్రా స్థలాల్లో, దక్షణాదిలోని దేవాలయాల్లో పూజారి వర్గం నీతిగా నిరాడంబరంగా ఆదర్శవంతమైన జీవితాన్నేమీ గడపలేదు. ఈ పవిత్ర స్థలాలు మధ్యయుగాల్లో వాటికన్‌లాగా విందులకు విలాసాలకు కేంద్రాలే. దేవదాసీ పద్ధతిగా వ్యభిచారం మత వ్యవస్థగా పవిత్రీకరించ బడిందన్న విషయం కూడా సత్యమే.

మొత్తం మీద బ్రాహ్మణులు భౌతిక సుఖాలను విసర్జించి నిరాడంబర జీవితాన్ని గడిపారు. కానీ తాము హిందూ సమాజానికి సామాజిక, ధార్మిక అధికారులమన్న దురహంకారం వారికి ఉండేదనటానికి ఎలాంటి సందేహమూ లేదు. వారు పవిత్రులు, ఇతరులందరూ అపవిత్రులు సమాజంలో వారు ఉన్నతులు, ఇతరులందరూ అధములు. సమాజంలో వారి మాటకు ఎదురులేదని వారికి తెలుసు. అందుచేత వారు శారీరక

సుఖాలను విసర్జించారు. తాము పాలకవర్గానికి చెందినవారమన్న ఆత్మ సంతృప్తి ఈ నష్టాన్ని అవసరానికి మించి భర్తీచేసింది.

## చాతుర్వర్ణ వ్యవస్థను భగవంతుడు సృష్టించాడా?

ఒకే భావాలు, భారతీయ సమాజంలోని వేర్వేరు వర్గాలకు వేర్వేరు అర్థాలనెలా ఇచ్చాయోకూడా పరిశీలించాలి. ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. అంతేకాదు ఇది చాలా ఇబ్బందికరమైన ప్రశ్న కూడా. అందుచేతనే మన ప్రాచీన నాగరికతను గుడ్డిగా ఆరాధించే వారికి ఈ ప్రశ్న స్ఫురించదు. స్ఫురించినా వారు దాన్ని దాటవేస్తారు. నీళ్ళు మోసేవారూ, కట్టెలు కొట్టేవారూ అయిన శూద్రులు అంత్యజులు, మన నాగరికతను గూర్చి ఏమనుకొనే వారు? అధికార గౌరవ శిఖరాగ్రాలమీద కూర్చున్నవారికి, వీరికి మన ప్రాచీన నాగరికత ఒకేలా కనిపించదా? వాళ్ళు తమ బాధల్ని నోరెత్తకుండా భరించారన్నది వేరే విషయం. కానీ మన ప్రాచీన నాగరికతలోని "దివ్య సౌందర్యాన్ని" చూసి వారు ఆనందించారా?

ఈ ప్రశ్నకు జవాబు చాలా చేదుగా వుంటుంది. కానీ అది సత్యం, పాలకవర్గాల వారి "ప్రశాంతతకూ" "మనశ్శాంతికీ" కారణం వారి ఆత్మ, సర్వశక్తి సంపన్నమైన బ్రహ్మ రెండూ ఒకటేనన్న భావం. ఆ భావమే వారు ఈ లోకంలో అనుభవిస్తున్న అధికారానికి ఆధారం. చాతుర్వర్ణ వ్యవస్థలో వారికున్న గొప్ప స్థానం శాశ్వమైనది. భగవంతుడు ప్రసాదించింది. కాబట్టి తాము ఇతరుల మీద సవారీ చేయవచ్చు. గత జన్మల్లో చేసుకున్న పుణ్య కారణాలవల్ల ఈ జన్మలో ఇతరుల శ్రమ ఫలితాలను తిని బ్రతకవచ్చు. కాబట్టి ఇలాంటి "మనశ్శాంతి", "సంతృప్తి" ఎవరికి ఆనందంగా ఉండవు?

## భారతీయ ఆధ్యాత్మిక వాదానికి పునాది-పునర్జన్మ సిద్ధాంతం

కానీ సమాజానికి అవతలివైపు ఉన్న చిత్రమేమిటి? సామాన్య ప్రజానీకం కూడా "సంతృప్తిని" "మనశ్శాంతిని" అనుభవించారు. తమ జీవితాలు మరోరకంగా ఉండటానికి వీల్లేదన్న విశ్వాసంలోనుంచి అశాంతి, సంతృప్తి వచ్చాయి. ఈ జన్మలో తాము పడుతున్న కష్టాలు గత జన్మల్లో చేసుకున్న పాపాల ఫలితమన్న నమ్మకంలోంచి అవి వచ్చాయి. తాము కడగండ్ల బ్రతుకుతో సంతృప్తి చెందాలి. ఎందుకంటే ఆ బతుకును భగవంతుడు, "ప్రకృతి" తమకు ప్రసాదించారు. ఈ జన్మలో పైవారికి సేవ చెయ్యాలి. విసుగులేకుండా

విరామంలేకుండా సేవ చేయాలి. దాని ఫలితంగా మరుజన్మలో మెరుగైన బతుకు లభించవచ్చు. భారతీయ ఆధ్యాత్మిక వాదం (వేదాంతం) సారాంశమిది. దాన్నే వారు నమ్మారు. శతాబ్దాల పాటు, సహస్రాబ్దాలపాటు ఆ నమ్మకంతోటే బతికారు.

దోపిడీ వర్గ సమాజంలోని విశ్రాంత పాలకవర్గాల భావజాలమైన సంతృప్తి, మానశ్శాంతి క్రమంగా కింది వర్గాల వరకూ దిగి వచ్చాయి. తమ స్వభావాన్ని పూర్తిగా మార్చుకుని అవి శ్రామిక వర్గం భావజాలంగా మారిపోయాయి.

## ప్రవృత్తి-నివృత్తిగా ఎలా మారింది?

ప్రాచీన భారతీయ నాగరికతను మొత్తంగా ఆరాధించేవాళ్ళు ఈ గుణం ఆనాటి జీవితం పట్ల అసంతృప్తిని, అశాంతిని ప్రోత్సహించిందని చెప్పరు. సాహసాన్ని, పరిశోధనను నిరుత్సాహ పరిచిందని అంగీకరించరు. ఆ సమాజంలో మహోన్నతమైన సముచిత్తత్వం ఉండేదని మాత్రమే వాదిస్తారు.

అలాంటి వాతావరణంలో మార్పుకాక మార్పులేకపోవటం సుగుణంగా మారిపోతుంది. అసంతృప్తి, తిరుగుబాటుకాక ఉన్నదాంతో సంతృప్తిపడటం సుగుణంగా మారి పోతుంది. పవృత్తి (పనిచేయటం) కాక నివృత్తి (తనలోకి తాను కుంచించుకు పోవటం) సుగుణంగా మారిపోతుంది. మార్పులేని, చలనంలేని జీవిత విధానాన్ని ఆదర్శీకరించటమే ఈ నాగరికత ప్రధాన లక్షణం.

మార్క్స్ ఈ విషయాన్ని సరిగ్గా గుర్తించాడు. ఈ సామాజిక వ్యవస్థ మానవుడి బుద్ధిని అత్యంత సముచితమైన పరిధిలో బందీగా, మూఢనమ్మకాల చేతిలో పనిముట్టుగా, సంప్రదాయ భావాలకు బానిసగా మార్చివేసిందని ఔన్నత్యాన్ని చారిత్రక చైతన్యాన్ని దానికి దూరం చేసిందని మార్క్స్ చెప్పాడు. ("ది బ్రిటీష్ రూల్ ఇన్ ఇండియా.").

## స్థిత ప్రజ్ఞుడు అనే భావానికి ప్రాతిపదిక ఏమిటి?

"భగవద్గీత" ఈ నాగరికతలోని ఆదర్శ మానవుణ్ణి చాలా చక్కగా అందంగా వర్ణిస్తుంది. 'భగవద్గీత'లో అతని పేరు "స్థితప్రజ్ఞుడు" - అంటే అతీంద్రియ జ్ఞానం, మార్పులేని, చలనంలేని స్థితికి చేరుకున్నవాడు.

"గీత"లో వర్ణించబడ్డ ప్రకారం "స్థితప్రజ్ఞుడు" మనసులో పుట్టే అన్ని కోరికల నుంచి విముక్తి పొందినవాడు," "పొగడ్తలకు, ద్వేషానికి అతీతుడు," బంధాలను, భయాన్ని, కోపాన్ని జయించినవాడు," "సుఖ దుఃఖాలలో సమచిత్తత కలిగినవాడు", "ఆత్మరతితో సంతృప్తిని సాధించినవాడు," "తాబేలు తన కాళ్ళను తనలోకి

ముడుచుకన్నట్లుగా తన ఇంద్రియాలను స్వాధీనం చేసుకున్నవాడు," "గాలిలేని శూన్య ప్రదేశంలోకూడా దీపకళికలా వెలిగేవాడు" - మొదలైన అనేక గుణాలను కలిగినవాడు.

"భగవద్గీత" కూడా నిష్కామ కర్మయోగాన్నే ప్రబోధించిందని కొందరు అభ్యంతరం చెప్పవచ్చు. ఈ విషయాన్ని మరొక అధ్యాయంలో పరిశీలిస్తాను.

ఈ వర్ణనప్రకారం స్థితప్రజ్ఞుడు అసాధారణమైన ఆత్మస్థైర్యం, ఆత్మసంయమనం కలిగినవాడు. కానీ అతని సంతృప్తి "మనస్సును తన ఆత్మమీద కేంద్రీకృతం చేయటం చేత" సాధించింది మాత్రమే. అంతేకాని బయట ప్రపంచాన్ని అర్థం చేసుకోవటంచేత సాధించింది కాదు. నేను చెబుతున్న విషయానికి ఇది చాలా కీలకమైన అంశం.

స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, మొదలైన భావాలు మన మత గ్రంథాల్లో ఎక్కడా కనిపించవు. ఇదికూడా చాలా ముఖ్యమైన విషయమే. మన మత గ్రంథమేదీ మానవులంతా సమానమన్న భావాన్ని (అందరిఆత్మలూ సమానమన్న అలౌకికార్థంలోతప్ప) బోధించదు. అందరూ మోక్షాన్ని పొందిన తరువాత మాత్రమే స్వాతంత్ర్యాన్ని, సమాన భూమిమీద జీవితం "మాయ" అని తెలుసుకోవటమే స్వాతంత్ర్యం. కానీ వాస్తవిక సామాజిక జీవితంలో దోపిడీని అంతంచేసి స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం స్థాపించటాన్ని సమానత్వం సాధించటానికి అసాధ్యమైన, కఠినమైన వర్ణవ్యవస్థ మాత్రమే. సామాజిక ఆర్థిక, బౌద్ధిక రంగాల్లో కఠినమైన హెచ్చుతగ్గుల, తరతమ భేదాల వ్యవస్థ ఉన్న సంస్కృతిలో సమానత్వం, సోదరత్వంలాంటి భావాలు ఎలా ఉంటాయి?

నిష్పక్షపాతమైన ఏ వ్యక్తయినా పీడితవర్గాల ప్రజలు దీన్ని ఎలా అర్థంచేసుకున్నారో తెలుసుకోగలడు. కానీ చరిత్ర తన పద్ధతిలో ఇందుకు ప్రతీకారం చేసింది. విశ్రాంత, పాలకవర్గాలకు్కూడా మార్పులేకపోవటం, నైతికంగా, బౌద్ధికంగా ఎదగలేకపోవటం మాత్రమే దీనివల్ల మిగిలింది.

క్రీ.పూ. 4వ శతాబ్దంలో జగజ్జేత అలెగ్జాండర్ రావీనదిని దాటి భారతదేశంలోకి రాలేకపోయాడు. 14 శతాబ్దాల తరువాత మహమ్మద్ గజనీ వెన్నపూసలోకి చాకులా భారత వర్షంలోకి దూసుకువచ్చాడు. తమ రాజ్యాల్ని కాదుగదా, తమ పూర్వీకులు నిర్మించిన దేవాలయాల్ని కూడా ఏ నాయకుడూ కాపాడుకోలేకపోయాడు. మన స్మృతులు, కుల ప్రాతిపదికగా ఉన్న గ్రామీణ వ్యవస్థ, శంకరుడి మాయావాదము దేశాన్ని ఆ స్థితికి తెచ్చాయి.

మార్పును కాకుండా నిశ్చలత్వాన్ని, అలజడిని కాకుండా సంతృప్తిని మహోన్నత జీవితాదర్శాలుగా ఎన్నుకున్న సమాజానికి ఇలాంటి గతే పడుతుంది.

## అరిస్టాటిల్‌కు శంకరునికి గల తారతమ్యాలు

గ్రీకులు కొత్త వస్తువుల్ని, సాధనాలని కనిపెట్టే స్వభావం ఉన్నవారు. వారు జీవితాన్ని వాస్తవికంగా, సమగ్రంగా, హేతుబద్ధంగా అర్థం చేసుకోవాలన్న తపన ఉన్నవారు. గ్రీకులు బయట ప్రపంచాన్ని చూశారు. భారతీయులు తమలోకి తాము చూసుకున్నారు. అంతర్ముఖుడై సాధన చేయటం మాత్రమే అన్ని జీవిత సమస్యలకూ భారతీయులు సూచించిన పరిష్కారం. గ్రీకు నాగరికతకు అరిస్టాటిల్ సంకేతమైతే, హిందూ జీవిత దృక్పథం సారాంశానికి శంకరుడు ప్రతిరూపం.

వీటితో పోల్చినప్పుడు కాస్త అప్రధానమనిపించే మరికొన్ని ప్రత్యేకతల్ని కూడా ప్రస్తావించాలి. ఇండో-ఆర్యులు ఇటుకతో, రాతితో ఇళ్ళుకట్టడం నేర్చుకోవటానికి చాలా కాలం పట్టింది. దీనికి కారణం తెలుసుకోవటం కష్టమేమీ కాదు. వారి సంచార పశుపాలనా జీవనం, హరప్పా నాగరికత అవశేషాలను తుడిచిపెట్టి ఆ పిమ్మట తిరిగి వ్యవసాయాన్ని, చేతివృత్తులను స్వీకరించి స్థిరనివాసానికి కుదరటానికి మధ్య దీర్ఘకాలవ్యవధి, అందుకు కారణాలు. ఋగ్వేద ప్రజల దృష్టిలో చుట్టూరా మట్టి, ఇటుక గోడలున్న అనార్య జనపదాలు అధికార కేంద్రాలు. వాటిని నాశనం చేయాలి. వారు ఈ "విశ్వాస హీనుల కోటల్ని" నాశనం చేయమని ఇంద్రుణ్ణి మాటి మాటికీ ప్రార్థించేవారు.

## శృతులు అన్న పేరు ఎందుకు, ఎలా వచ్చింది?

ఇండో-ఆర్యులు లిపిని రూపొందిచటానిక్కూడా చాలాకాలాన్ని తీసుకున్నారు. ఆర్యుల దండయాత్రల్లోనో, బహుశా అంతకుముందో హరప్పా లిపి పోయింది. ఋగ్వేద కాలం ప్రారంభంనుంచి ప్రధాన ఉపనిషత్తుల రచనాకాలం పూర్తయ్యేవరకు (మగధ సామ్రాజ్య ప్రారంభకాలం). ఇండో-ఆర్యులకు లిపిలేదు.

నిజానికి వేదాలకు, బ్రాహ్మణాలకు, అరణ్యకాలకు ఉపనిషత్తులకు "శృతులు' ' అని పేరు. అంటే విన్న సాహిత్యమన్నమాట, ఆ మాటకు అసలైన' అర్థం "ఆవిష్కరించబడింది" అని. ఏది ఏమైనా కనీసం వేయి సంవత్సరాల కాలం ఈ సాహిత్యమంతా ఒక తరంనుంచి మరొక తరానికి కంఠపాఠంగా (ఒక పదంగానీ, శబ్దంకానీ మారకుండా) సాహిత్యాన్ని, దాని రహస్యాన్ని తమ స్వాధీనంలో ఉంచుకోవాలన్న కోరిక మాత్రమే ఇందుకు కారణం కాదు. తరువాత కాలంలో ఈ సాహిత్యం లిపిబద్ధం చేయబడింది. కానీ దానికున్న నిగూఢ పవిత్రత లేకపోవటమే ఈ మౌఖిక సంప్రదాయానికి కారణం. దాదాపు అదే కాలం లోనే బ్రాహ్మి లిపి రూపొందటం ప్రారంభమైంది. అదే ఇండో-ఆర్యన్ నాగరికతకు మొదటి లిపి.

## స్మార్త సాహిత్యం అంటే...?

తరువాత వచ్చిన సాహిత్యాన్ని స్మార్త సాహిత్యమంటారు. అంటే జ్ఞాపకం ఉంచుకొని రాసుకున్నదన్నమాట. స్మృతులు, 'భగవద్గీత' స్మార్త సాహిత్యం. సూత్ర ప్రాయంగా స్మార్త సాహిత్యం కంటే శ్రౌత సాహిత్యమే (శ్రుతులు) ఎక్కువ పవిత్రమైందని హిందువులు భావిస్తారు. కానీ గుప్తులతరువాత కాలంలోని హిందూమతం స్మార్త హిందూమతమే.

మగధ సామ్రాజ్య కాలం ప్రారంభానికి సామాజిక ఆర్థిక జీవితం లిపి అవసరమైనంతగా అభివృద్ధి చెందిందనటానికి సందేహం లేదు. కానీ అంతకుముందు యుగంలోనో (ఆదిమ భారతదేశ చరిత్ర యుగం), కనీసం బ్రాహ్మణాల-ఉపనిషత్తుల యుగంలోనో ఇండో-ఆర్యన్‌లు లిపిని రూపొందించ గలిగినంతగా అభివృద్ధి చెందారు. కానీ వారెందుకు ఆ పని చేయలేదు? ఈ ప్రశ్న కు నా వద్ద సమాధానం లేదు.

మరో ఆసక్తికరమైన పరిణామంకూడా ఉంది. ఇండో-ఆర్యులు తమ రథాలకు గుర్రాలను పూన్చగలిగేవారు. కానీ వారు గుర్రాలమీద స్వారీ చేసినట్టు కనపడదు.

అలెగ్జాండర్‌తో వీరోచితంగా పోరాడిన పురుషోత్తముడికి భూసైన్యం, ఏనుగులు రథాలు ఉండేవి. కానీ అలెగ్జాండరు కుండిన ఆశ్వికదళం పురుషోత్తముడికి ఉండేది కాదనుకుంటాను. ఆ తేడాయే యుద్ధం ఫలితాన్ని నిర్ణయించింది. పురుషోత్తముడు ఎంత భయంకరంగా పోరాడారంటే మొట్టమొదటిసారిగా అలెగ్జాండర్ సైన్యానికి శత్రువుమీద గౌరవం కలిగింది. అందుకే అలెగ్జాండర్ రావీనదిని చేరేసరికి అతని సైన్యాలు తిరుగుబాటుచేసి మాతృదేశానికి తిరిగి వెళ్ళిపోవాలని పట్టుబట్టాయి. బహుశా అప్పటికే నందరాజుల మహాసైన్యాన్ని గురించిన వార్తలు అలెగ్జాండర్ చెవుల్లో పడివుంటాయి. అందుకే పరాక్రమం కంటే విచక్షణే ప్రధానమనుకొని వెనక్కు మళ్ళాడు.

## వేద కాలంలో జూదమంటే అంత వెర్రివ్యామోహం ఎందుకు?

చివరగా ఒక వింతైన ప్రత్యేకతను గురించి ప్రస్తావిస్తాను. వేదకాలం ప్రజలకు జూదమంటే వెర్రి వ్యామోహం ఉండేది. పాచికలు లేకండా రుషులుకూడా బతకలేక పోయేవారు. ఒక రుషి జూదంలో తన ఆస్తిపాస్తుల్ని, గౌరవ మర్యాదల్ని, చివరకు భార్యను పోగొట్టుకుని పశ్చాత్తాపం పడటం, ఆత్మవిమర్శ చేసుకోవటం రుగ్వేదంలోని ఒక సూక్తంలో ఆసక్తికరంగా వర్ణించబడింది. అతడు ఆత్మవిమర్శ చేసుకున్న తరువాత బాగుపడతాడో లేదో మనకు తెలీదు. ఆర్యులకు చరిత్రను రికార్డు చేడయటంలో

నమ్మకం లేదు.

చివరగా, ఇండో-ఆర్యులు ఆటల్లో ఆసక్తి చూపించిన దాఖలాలు వైదిక సాహిత్యంలో లేవు. వారి శౌర్య, పరాక్రమాలను, యుద్ధ ప్రయత్నాన్ని దృష్టిలో ఉంచుకొని చూస్తే ఇది చిత్రంగా కన్పిస్తుంది. ఎందుకు? బహుశా దేవతలకు తెలుసా? "నాస దీయ సూక్తం" రచయితతో ఏకీభవిస్తూ దీన్ని ముగిస్తున్నాను.

నాసదీయ సూక్తం రుగ్వేదంలోకి చివరి మండలంలో వస్తుంది. రుగ్వేదం లోని ఆదిమ భౌతిక వాదానికి, తరువాత కాలంలో ఉపనిషత్తుల్లో అభివృద్ధి చెందిన భావవాదానికి మధ్య ఉన్న సంధి యుగానికి నాసదీయ సూక్తం అద్దం పడుతుంది. ప్రపంచం లోని తురీయమైన ఐక్యతా సూత్రం ఏమిటో అర్థం చేసుకోవటానికి ఈ సూత్రకారుడు సతమతమైపోయాడు. రుగ్వేదంలోని అసంఖ్యాక దేవతలతోను; గాలి, నీరు. అగ్ని, ఆకాశం మొదలైన మూలకాలకు దైవత్వాన్ని ఆపాదించే పద్ధతితోను అతడు విసిగిపోయాడు. వేదాలు చెప్పే విశ్వశాస్త్రం (కాస్మాలజీ) మీద విశ్వాసాన్ని పోగొట్టుకున్నాడు. కానీ ఉప నిషత్తులు చేప్పే ఆత్మ, బ్రహ్మ సిద్ధాంతాలను అతడు అప్పటికింకా 'కనిపెట్టలేదు".

కాబట్టి అతడు తాను జవాబు ,చెప్పగలిగిన వాటికంటే ఎక్కువ ప్రశ్నల్ని అడగటం సహజమే. చిట్టచివరికి అతడు తాను అడుగుతున్న ప్రశ్నలకు దేవతలకైనా సమాధానాలు తెలుసా అని సంశయ వాదంతో ప్రశ్నిస్తాడు. ఈ సూక్తిలోని అందం దానిలోని సరళత్వంలోనూ, ఊహాశక్తిలోను ఉంది.

రుగ్వేదకాలపు మౌలిక భౌతిక వాదంనుంచి ఉపనిషత్తుల భావ వాదానికి వచ్చిన మార్పును గురించి తరువాత అధ్యాయాల్లో పరిశీలిస్తాను.

నాసదీయ సూక్తాన్ని సామాజిక - చారిత్రక ఆలోచనా ప్రవంతిగా పరిశీలిస్తే అందులో ఆశ్చర్యకరమైన విషయమూ లేదు, అర్థంకాని విషయమూ లేదు. కానీ వేదాంత వాదులు దాన్ని అలాచూడరు. అందులోని మార్మికత్వం, గందరగోళమైన ఆలోచనా మానవుని బుద్ధిశక్తికి శిఖరప్రాయాలుగా వారికి కనిపిస్తాయి.

ఈ సూక్తానికి సంబంధించిన ఒక చాలా ముఖ్యమైన విషయాన్ని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తాను. "సత్", "అసత్" అన్న మాటలు భారతీయ తత్వశాస్త్రంలో చాలా ప్రధానమైనవి. "సత్" అంటే అస్తిత్వం ఉన్నది, నిజమైనది. "అసత్" అంటే అస్తిత్వం లేనిది, నిజంకానిది.

# సత్-అసత్ పదాల అర్థాలు ఏమిటి?

తొలిరోజులు వైదిక మేధావులు "సత్" అన్నమాటను ఇంద్రియ గోచరమైన, భౌతిక ప్రపంచాన్ని; "అసత్" అన్న మాటను ఇంద్రియ జ్ఞానానికి అతీతంగా ఉన్న పరలోకాన్ని సూచించటానికి ఉపయోగించారు. ఉపనిషత్తులలో ఈ అర్థాలు తారుమారయ్యాయి. "సత్" అంటే ఇంద్రియాతీయమైన, అచింత్యమైన బ్రహ్మపదార్థమన్న అర్థం వచ్చింది. "అసత్" అంటే ఇంద్రియ గోచరమైన, వాస్తవిక ప్రపంచమైపోయింది. తిలక్ "గీతారహస్యం" అన్న తన గ్రంథంలో ఈ విషయాన్ని సుదీర్ఘంగా చర్చించాడు. తిలక్ వేదాంత వాదేకానీ అతని అభిప్రాయం ప్రకారము నాసదీయ సూక్తంలో "సత్" అన్నమాట ఇంద్రియ గోచరమైన ప్రపంచాన్ని, "అసత్" అన్నమాట ఇంద్రియాతీతమైన పరలోకాన్ని సూచిస్తాయి. ఇది చాలా ముఖ్యమైన విషయం.

నాసదీయ సూక్తాన్ని చాలామంది విద్వాంసులు చాలా భాషల్లోకి అనువాదం చేశారు. నా అనువాదం తిలక్, ఆచార్యకాణే చేసిన మరాటీ అనువాదం మీద ఆధారపడి ఉంది. వీరిద్దరూకూడా ప్రసిద్ధ విద్వాంసులే. నా సంస్కృత పాండిత్యం మాత్రమే పరిమితమైంది.

"ఆదిలో సత్‌లేదు, అసత్‌లేదు, ఆకాశంలేదు, దానికావల అనంత విశ్వంలేదు.' ' అలాంటప్పుడు ఎవరు ఎవరిని ఆవరించి ఉన్నారని ఎలా చెప్పటం? ఎక్కడ? ఎవరి ఆనందంకోసం? అప్పుడు అక్కడ అగాధమైన జలరాశులుండేవా?

"అప్పుడు మృత్యువూలేదు, అమృతత్వమూలేదు. ఏదీ నశించేదీకాదు, నశించకుండా ఉండేదికాదు. రాత్రింబవళ్ళను వేరుచేయగల సాధనాలూ ఉండేవికావు. అప్పుడు ఆ ఒక్కటే (తదేకం) గాలిలేకున్నా తనంతట తానుగా శ్వాశిస్తూ ఉండేది. అదిలేకుండా మరేదిలేదు. దాన్ని మించింది కూడా మరొకటి లేదు. (తస్మాద్ధావ్యన్న పరఃకించనాస).

అప్పుడు అంతా చీకటిలో మునిగిలేదా? అవిభాజ్యమైన నీరా? సర్వవ్యాప్తమైన సూత్రమా? ప్రయోజనంలోని మాయా? తపశ్శక్తి చేత సృష్టించబడిందా?

"సత్, అసత్‌ల కావల ఉన్న దాని విత్తనం సృష్టి చేయాలన్న కాంక్షను మొలకెత్తచేసింది. అదే సత్‌కు అసత్‌తో ఉన్న సంబంధం లోతుగా ఆలోచించి తెలుసుకున్న రుషులు ఈ విషయాన్ని నొక్కిచెప్పారు.

"ఆ మాత్రం, ఆ కిరణం వ్యాప్తి చెందింది. అది పైన ఉంది. కింద ఉంది. కొన్ని

(కిరణాలు) ఉత్పత్తి చేశాయి. అభివృద్ధి చెందాయి. పెద్ద (గొప్ప) వయ్యాయి. వాటి స్వయంశక్తి ఈ వైపున ఉన్నవాటికి, ఆ వైపున ఉన్నవాటికీ వ్యాపించింది.

"సత్ (జగత్తు) ఎక్కడనుంచి, దేనినుంచి వచ్చిందని ఎవరుమాత్రం ఇంతకంటే ఎక్కువ చెప్పగలరు? నిర్దిష్టంగా ఎవరికి మాత్రం తెలుసు? సృష్టి తరువాతనే దేవతలు కూడా వచ్చారుకదా? కాబట్టి ఈ జగత్తు మూలమేదో ఎవరికి తెలుసు?

"సృష్టించబడిందో లేదో తెలియని విశ్వం పైభాగాన ఉన్న విశాల స్వర్గాన్ని అధిష్టించి ఉన్న దేవునికి మూలాన్ని గురించి బహుశా తెలుసు కాబోలు. ఒకవేళ అతనికి కూడా తెలియదేమో."

- తెనుగు సేత: శ్రీ వల్లంపాటి వెంకట సుబ్బయ్య

"భారతీయులు తమ దేశం తప్ప మరొకదేశం లేదనుకుంటారు; అంతేకాదు తమలాంటి దేశం, తమ రాజు లాంటి రాజు, తమ మతం లాంటి మతం, తమ సైన్సులాంటి సైన్సు కూడా లేదనుకుంటారు. తమకు తెలిసింది ఇతరులకు చెప్పటానికి భారతీయులు చాలా పిసినారితనాన్ని చూపుతారు. తమలోనే ఇతర కులాలకు చెందినవారికి ఆ విజ్ఞానం అందకుండా చాలా జాగ్రత్తపడతారు. ఇక పరదేశీయుల సంగతి సరేసరి".

ఆల్ బెరూనీ మన శాస్త్రవేత్తల్ని గురించి ఇలా అన్నాడు. "వారు పూర్తిగా గందరగోళంలో ఉన్నారు. వారి ఆలోచనలో తర్కం ఎంతమాత్రమూ లేదు. చిట్టచివరకు వారి అభిప్రాయాలు సామాన్యజనంలో వున్న పనికిమాలిన అభిప్రాయాలతో కలిసిపోతాయి. వారి గణితశాస్త్రం, ఖగోళశాస్త్ర విజ్ఞానాన్ని నేను ముత్యాలు, చేదు ఖర్జూర గింజలు; లేదా ముత్యాలు, పేడ; లేదా రత్నాలు, గులకరాళ్ళు కలిసిన మిశ్రమంగా మాత్రమే పరిగణించగలను. భారతీయ శాస్త్రవేత్తలు సంపూర్ణంగా శాస్త్రీయమైన నిగమనపద్ధతి దాకా ఎదగలేదు. అందుచేత వారికి పై రెండురకాల వస్తువులూ ఒకటిగానే కనిపిస్తాయి"

ఆల్ బెరూనీ వర్ణించిన ఈ పరిస్థితి క్రీ.శ. ఐదు లేదా ఆరు శతాబ్దాల నుంచి అంటే హిందూ సమాజం మార్పు చెందటం పూర్తిగా ఆగిపోయిన నాటినుంచి - క్రమక్రమంగా అభివృద్ధి చెందిందని మనం గుర్తించాలి.

కీ॥శే॥ ఎస్.జి. సర్‌దేశాయి

అమరవీరుడు

# శ్రీపతి పండితారాధ్యుల మల్లిఖార్జునశర్మ



"కామ్రేడ్ శర్మ" . జన్మస్థలం తెనాలి తాలూకా ఈమని గ్రామం. 1910వ సంవత్సరంలో ఒక సనాతన ఆరాధ్య కుటుంబంలో పుట్టాడు.

తండ్రిగారు వీరభద్రయ్య అయ్యవారు. తల్లి లింగమాంబ. నలుగురు అన్నదమ్ములలో చిట్టచివరివాడు. తన రెండోయేటనే మాతృహీనుడయ్యాడు. పినతల్లి భ్రమరాంబగారి ఆదరణలో పెరిగాడు.

ఉపనయనాదికాలన్నీ తాడికొండలో మేనమామగారింట జరిగాయి.

మాతృభాష ఐన తెలుగు బాగా చదువుకున్నాడు. పంచకావ్యాలు పఠనం చేశాడు. 5వ ఫారం వరకూ ఇంగ్లీషు చదివాడు. హిందీలో రాష్ట్రభాషదాకా అధ్యయనం చేశాడు. తన యిరవయ్యోయేట భవాని అనే ఆమెను వివాహం చేసుకొని గృహస్తుడయ్యాడు. (1930)

అవి దేశమంతటా జాతీయభావాలు వెల్లివిరుస్తూన్న రోజులు. అప్పటి వరకూ కాంగ్రెస్ ఉద్యమం లాయర్లలాంటి మేధావుల చుట్టూనే తిరుగుతూండేది. ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపుకొనడంతోనే సరిపెట్టుకునేది. కాని...

1930 నాటికల్లా ఆ కట్టుతాళ్ళను తెంచుకున్నది జాతీయ ఉద్యమం. మహాత్మాగాంధీజీ నాయకత్వం వహించాడు.

## జాతీయ ఉద్యమంలో

బ్రిటిష్‌సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా విదేశీవస్తువులను బహిష్కరించడం, మాతృభాషలోనే సర్వకార్యాలూ నిర్వహించబడాలి అన్న భాషా రాష్ట్రవాంఛ, కోర్టులను, ఇంగ్లీషు చదువునూ నిరశించడం, అస్పృశ్యతా నివారణ, మద్యపాననిషేధ ప్రచారం, ఈత, తాడి చెట్ల గెలలు నరికి శాసనాన్ని ధిక్కరించడం, యిలాంటి పరిమితమైన సమస్యలతో కాంగ్రెస్ ఒక ఉద్యమరూపాన్ని తీసుకున్నది. మధ్యతరగతి ప్రజలవరకూ ఆకర్షించింది.

మన కామ్రేడ్ శర్మకూడా ఆ జాతీయోద్యమంచేత ఆకర్షించబడ్డాడు. 1931-32లో కార్యరంగంలో దూకాడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నాడు. 6 నెలలపాటు రాజమండ్రి జైల్లో శిక్ష అనుభవించాడు. మరొకసారి 6 నెలలపాటు రాయవేలూరు జైల్లో బంధించారు. ఒక సందర్భంలో దారుణమైన లాఠీఛార్జికి గురయ్యాడు.

ఈ సత్యాగ్రహోద్యమాలు అప్పుడప్పుడూ సాగుతూవుండటం, బ్రహ్మాండమైన ప్రజోద్యమం రూపాన్ని తీసుకోబోయే సమయానికి ఆపివేయడం, ఆ పోరాటం మీద నీళ్ళు చల్లడం వీటితో చాలామంది యువకుల్లో అసంతృప్తి బయలుదేరసాగింది. వారిలో మన శర్మకూడా ఒకడు. ఐనా త్వరపడకుండా తాను నమ్మిన ఆశయం కోసం

దీక్షతో పనిచేస్తూనే వచ్చాడు.

## ఖద్దరు ప్రచారం

జైలునుండి బయటికిరాగానే చాలా మంది కాంగ్రెస్‌వాదులు తమ పని అప్పటికి ముగిసినట్టు భావించేవాళ్ళు. అవసరమైతే మళ్ళీ జైలుకు పోవచ్చునని విశ్రాంతిగా కూర్చొనేవాళ్ళు. కాని శర్మ అలాకాదు. జైలునుంచి విడుదల కావడమే తిరిగి కార్యక్రమం. ఏముందీ? ఖద్దరు ప్రచారం. మోయలేనన్ని ఖద్దరు మూటలు మూపున వేసుకొనేవాడు. గ్రామగ్రామమూ తిరిగేవాడు. గడపగడపా ఎక్కేవాడు. గంటలకొద్దీ బోధపరచేవాడు. ఒక్క నిముషమైన వూరుకొనేవాడుకాదు. కాని ఈ శ్రమకంతా ఫలితమేమిటి? ఈ మార్గాన దేశానికి స్వాతంత్ర్యం వస్తుందా? అన్న సందేహం. కాని మరో మార్గం దగ్గరలో కన్పించదు. ఐనా అలా ఆలోచిస్తూనే తన ఖద్దరు ప్రచారాన్ని మాత్రం విడవకుండా సాగిస్తూండేవాడు. నూతన మార్గాన్ని అన్వేషిస్తూ వుండేవాడు.

అప్పటికి చాలాపూర్వమే రష్యాలో విప్లవం వచ్చింది. ప్రపంచంలో ఆరవభాగం సామ్రాజ్యవాదుల సంకెళ్లను త్రెంచుకున్నది. పీడిత ప్రజలు తమ జీవిత విధానాలను తామే దిద్దుకునే సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించారు. కాని రష్యన్ ప్రజల్ను ఎలా ఆ విజయాన్ని సాధించారు. ఆ మార్గాలేమిటి? అన్న విషయాలు మనదేశానికి వెంటనే రాలేదు. చుట్టూవున్న సామ్రాజ్యవాద దేశాలు ఆ వార్తలను త్రొక్కిపట్టాయి. ఎక్కడైనా ఆ సంబంధాలు బయటపడినా వాటిని నిషేధించాయి. మిగతా ప్రపంచం రష్యాచుట్టూ ఇనుపతెరలు బిగించింది.

కాని కాలం ఆగలేదు. సోవియట్ రష్యా విప్లవపు వెలుగులు ఈ ఇనుప తెరలను చీల్చుకుని పీడిత ప్రజలు మధ్యకువచ్చి పడ్డాయి.

## వర్గ సంఘాల నిర్మాణం

మనదేశంలో కూడా కాంగ్రెస్ ఉద్యమాలయెడ అసంతృప్తి చెందిన యువకుల దేవులాటలో ఆ వెలుగు కన్పించింది. అతివాదులంతా చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడి మార్క్సిస్టు సిద్ధాంత చర్చలు ప్రారంభించారు. ప్రపంచ శ్రామికులారా! ఏకంకండి!! అన్న ఆశయాన్ని ముందుంచుకుని వర్గసంఘాల నిర్మాణానికి పూనుకున్నారు.

కాంగ్రెస్‌లోనే వుంటున్న ఈ అతివాద యువకులంతా ఈ నూతన మార్గాన ప్రజానీకాన్నంతా ఐక్యపరచి సంఘటిత శక్తితో దేశస్వాతంత్ర్యాన్ని సాధించగలమనీ, కాంగ్రెస్‌ను ఈ సరియైనబాటను పట్టించాలనీ ప్రయత్నించారు.

## ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ

ఈ ప్రయత్నాల ఫలితంగానే ఆంధ్రలో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీతోను మార్క్సిస్టు సాహిత్యంతోనూ కామ్రేడ్ శర్మకు సంబంధాలు యేర్పడ్డాయి. 1935నుంచీ కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలలో ప్రవేశించి కార్యక్రమం సాగిస్తూ వచ్చాడు.

1936 ఎన్నికలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకూ వారి బడి తొత్తులైన జమీందారీ భూస్వామ్యవర్గాలకు వ్యతిరేకంగా జస్టిస్ పార్టీని ఓడించి కాంగ్రెస్‌ను గెలిపించడంలో ప్రధానపాత్ర వహించాడు శర్మ.

రెండవ ప్రపంచయుద్ధ మేఘాలు అలముకొంటున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మనదేశాన్ని కూడా యుద్ధరంగంలోకి లాగుతున్నారు. ఆ సమయంలో సామ్రాజ్యవాద యుద్ధాలకు వ్యటిరేకంగానూ మహాత్మాగాంధీజీ ప్రారంభించిన వ్యష్టి సత్యాగ్రహం ప్రజా ఉద్యమంగా మార్చవలసిన అవసరాన్ని గూర్చి కమ్యూనిస్టుపార్టీ ఇచ్చిన కార్యక్రమాన్ని నెరవేరుస్తూ వచ్చాడు. ఆరోజుల్లో కమ్యూనిస్టు పార్టీ నిషేధంలో వుంది. తాను పార్టీ రహస్య యంత్రంతో సంబంధాలు పెట్టుకుని బయట కార్యక్రమాన్ని, కార్మిక సంఘాల నిర్మాణాన్ని ముఖ్యంగా వ్యవసాయ కూలీసంఘాన్ని గ్రామగ్రామాన నిర్మిస్తూ వచ్చాడు.

## వ్యవసాయ కార్మికులలో గుర్తింపు

ఆనాటినుండి కామ్రేడ్ శర్మ యొక్క పట్టుదల, చొరవ, ఓపిక, సమస్యలను పరిష్కరించే విధానం, కలుపుగోలుతనం అన్నీ ప్రజలముందు ప్రదర్శితమయ్యాయి. వ్యవసాయ కూలీలోకం ఆయనను తమ ఆప్తబంధువుగా, నిజమైన ప్రజాసేవకుడుగా, తమ ప్రియమైన నాయకుడుగా గుర్తించుతూ వచ్చారు.

నిత్యమూ చిన్న చిరునవ్వు నవ్వుకుంటూ అలా... ఎండలేదు. వానలేదు. ఒక సంచి బుజానవేసుకొని, వక్కపొడి నములుకుంటూ ప్రశాంతంగా నడుచుకుంటూ ఎక్కడికో? ఏ ఒక్కరోజూ విరామం అంటూ లేకుండా ఎక్కడో ఒకచోట వ్యవసాయ కూలీల మధ్య తాను వుండాలి. వారి కష్టసుఖాలలో తానూ పాలు పంచుకోవాలి. వారి నుంచి తాను చాలా నేర్చుకోవాలి. వారికి బోధించాలి. ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి. త్వరగా చాలా త్వరగా ఏ బాధలు లేని నూతన సమాజాన్ని చేరాలి. అదీ తహతహ. ఆ ఆవేదనలో ఇల్లుపట్టదు. పిల్లా జల్లా గుర్తుకురారు, అన్ని యిళ్ళూ తనవే, అందరి బిడ్డలూ తన వాళ్ళే. తాను అందరికీ బిడ్డడే. తన జీవితంలోని ప్రతి క్షణమూ, ప్రతి ఆలోచనా, ప్రతి

పనీ అంతా ప్రజలకోసమే.

ఎర్రజెండాలు రెపరెపలాడుతూపోయే వూరేగింపులో రెండు పంక్తుల మధ్యా నడుస్తూ పిడికిలి బిగించి ఖణేల్‌మని నినాదాలిస్తూ కనపడేవాడు.

మరొకచోట మెగా ఫోన్ పుచ్చుకుని చెపుతుండేవాడు.

## ప్రజలకు శర్మ కావాలి

ఒకచోట సాహిత్యం అమ్ముతుండేవాడు. యింకొకచోట తీవ్రంగా చర్చిస్తూండేవాడు. అంతలో వేదికమీదికెక్కి కంచుకంఠంతో వుపన్యసించేవాడు. ఎక్కడైనా కూలీ రైతుల మధ్య తగాదాలువస్తే తీర్పరి ఆయనే. రైతులకూ్కడా కామ్రేడ్ శర్మ కావాలి.

బంజరు భూములకు పిటీషన్లు వ్రాయడం దగ్గర్నుంచీ, పెనాల్టీలు వేసినందుకు కలెక్టరుతో పోట్లాడటం వరకూ శర్మ పనే, వ్యవసాయ కూలీలు వెట్టిచాకిరికి, పిచ్చమానికలకూ, నాము పద్ధతికి వ్యతిరేకంగా సాగించిన అనేక పోరాటాలకు నాయకత్వం వహించాడు. న్యాయమైన కూలికోసం, పాలేర్ల జీతాలు, సెలవులకోసం చేసిన ఆందోళనలు, సమ్మె పోరాటాలు అనేకం నడిపాడు.

ఆయనకూ ఆయన సభ్యుడైయున్న కమ్యూనిస్టు పార్టీ గమ్యమే; పీడిత ప్రజల విముక్తి, అందరికీ తిండి, గుడ్డ, చేసుకునేందుకు పని, భూమి, అందరికీ అన్ని విధాలా అభివృద్ధికి సమానావకాశాలూ కల నూతన దివ్య సమాజం.

అందుకు మార్గం: కూలి, రైతు, వివిధ పీడితవర్గాల విశాల ఐక్య సంఘటన

## ఎర్రజెండా బహుమానం

అందుకే రైతులకవసరమైన కృష్ణ కాల్వల మరమత్తులో సైతం స్వయంగా పాల్గొన్నాడు. అహోరాత్రులూ పాటు పడ్డాడు. పైన భగ్గున చెరిగిపోసే ఎండ, క్రింద కాళ్ళు బొబ్బలక్కే ఇసుక ముచ్చెమటలు కారుకుంటూ నిలువునా కాలువలో నుంచి దయ్యాల్లాంటి కట్టలమీదకు మట్టి ఎత్తిపోయడం, అలా మొత్తం కాలమంతా వెన్నువంచకుండా పోరాడాడు. కమ్యూనిస్టు పార్టీ పెట్టి ఎర్రజెండా బహుమానాన్ని అందుకున్నాడు.

సనాతన కుటుంబంలో మంత్రతంత్రాల మధ్య పుట్టి పెరిగిన మల్లిఖార్జునశర్మ ఎక్కడా? మట్టిపనిలో బహుమాన మందుకోవడమేమిటి? ఆశ్చర్యమే.

అది...శర్మకాదు, ఆయనలోని విప్లవదీక్ష. కమ్యూనిస్టుపార్టీ ఆయనకిచ్చిన విప్లవోత్సాహం.

అలాగే రైతుల కౌలుదారీ పోరాటాలకూ నాయకత్వం వహించాడు. కుంచవరం

గ్రామంలో పెద్ద ఇనాందారుకు వ్యతిరేకంగా కౌలుదార్లను సమీకరించి పోరాటం నడిపాడు.

అందుకే శర్మపేరు వినడమే కూలీ రైతు ప్రజాసామాన్యం ఉత్సాహోద్రేకాలతో ముందుకువస్తారు. తమ నాయకుడుగా భక్తి విశ్వాసాలతో ప్రేమించుతారు.

ఇక భూస్వాములలో కామ్రేడ్ శర్మ పేరు గుండెల్లో గాలం. ఆయనంటే అరికాలిమంట. ఆ దోపిడీదార్లకు ప్రధాన శత్రువుక్రింద లెక్క. ఆ కసితోనే తమ బడితొత్తుగా వ్యవహరిస్తున్న కాంగ్రెస్ పరిపాలన కాలం (1950)లో దారుణంగా హత్య చేయించటానికి పాటుపడ్డారు.

## ఫాసిస్టు ప్రమాదం

1942 నాటికి భారతదేశానికి జపాన్ ఫాసిస్టు ప్రమాదం ముంచుకు రాసాగింది. ఆనాడు కమ్యూనిస్టుపార్టీ దేశరక్షణకు పూనుకోవాలన్న నినాదంమీద, అటు కాంగ్రెస్‌వాదులు యిటు ప్రజలూ యిద్దరి మధ్యా, జాతీయ నాయకుల విడుదలకూ, దేశరక్షణ కార్యకలాపాలకూ తీవ్రకృషి సాగించాడు. రైతు కూలీ ఐక్యతకు కృషిచేశాడు. యుద్ధకాలంలో పెరుగుతున్న ధరలకు, బ్లాకుమార్కెట్‌కూ వ్యతిరేకంగా ప్రజలవైపున నిలబడి పోరాడుతూ కమ్యూనిస్టుపార్టీ యిచ్చే ప్రతి కార్యక్రమంలో ముందుకు వచ్చాడు.

1943లో కమ్యూనిస్టు పార్టీ నిధికి పిలుపుయిచ్చింది. కామ్రేడ్ శర్మ మొట్టమొదటిసారిగా తనవంతు ఆస్తిని సర్వస్వాన్నీ అమ్మి పార్టీ నిధికి జమకట్టాడు.

మొదటినుంచీ తన రాజకీయ జీవితంలో ఐదెకరాల సుక్షేత్రాన్ని త్యాగం చేశాడు. తన ప్రాణాలే ప్రజాసేవకోసం అర్పించడానికి సిద్ధంగావున్న కామ్రేడ్ శర్మ వ్యక్తిగత ఆస్తులంటేనే గిట్టని నిజమైన మార్క్సిస్టు శర్మకు ఇదొక లెక్కా?

1946లో వివిధ రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారాన్ని స్వీకరించింది. ప్రజలు తమ నిత్యజీవితావసరాలకోసం సాగించే ప్రతి పోరాటాన్నీ వ్యతిరేకిస్తూ వచ్చింది. భూస్వాములకూ, జమీందార్లకూ, బ్లాకు మార్కెటీర్లకూ అండగా నిలబడి ప్రజలపైన అత్యాచారాలకు పూనుకున్నది.

## స్వాతంత్ర్యం వచ్చింది

1947లో మౌంట్ బాటెన్ అవార్డుతో ఆగస్టు 15న స్వాతంత్ర్యం వచ్చేసింది. ఐనా ప్రజల కనీస అవసరాలు సైతం తీరలేదు. ధరలు చుక్కలంటుతున్నాయి. కూలీ రైతు మధ్యతరగతి ప్రజాసామాన్యం పెరిగే ధరలతో తమ జీవితాలను అందుకోలేని స్థితి ఏర్పడింది. అమితమైన పన్నులు, ఆదాయంలో కోత యిలా ప్రజాసామాన్యం కాంగ్రెస్‌పై

పెట్టుకున్న భ్రమలన్నీ మంచుతెరలలాగా విడిపోసాగాయి.

ఈ కాలంలో గత్యంతరంలేని కూలీ రైతులు విప్లవ చైతన్యంతో ముందుకు వస్తున్నారు. అనేకచోట్ల పాలేర్లు, కూలీలు తమ న్యాయమైన కూలీ రేటు కోసం పోరాటాలు ప్రారంభిస్తున్నారు.

భూస్వామ్య దోపిడీవర్గాల రక్షణ కోసం కంకణం కట్టుకున్న కాంగ్రెస్ ముందుగానే ప్రజలపై విరుచుకుపడ్డది. పీడిత ప్రజలకు అగ్రగామియైన కమ్యూనిస్టు నాయకుల మీద అరెస్టు వారెంట్లు జారీ చేసింది. వ్యవసాయ కూలీ నాయకుడైన మన కామ్రేడ్ శర్మను వదలిపెట్టుతుందా. 1948లో కామ్రేడ్ శర్మ కూడా రహస్య జీవితానికి వెళ్ళిపోయాడు. రహస్యంగానే వుంటూ వ్యవసాయ కూలీ పోరాటాలకు నాయకత్వం వహించాడు. తెనాలి తాలూకాల్లో పెద్ద ఎత్తున సాగిన అమృతలూరు సమ్మె వగైరాలు ఆయన నాయకత్వానే సాగాయి.

## దారుణ హత్యాకాండ

1950 సెప్టెంబరులో ఒకనాడు ఉదయం దినపత్రికలు వార్తను మోసుకువచ్చాయి. "సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకుడు ఎస్.పి. మల్లిఖార్జున శర్మ మద్రాసులో పోలీస్ చీఫ్ దగ్గర ఉన్నా"డని.

ఆ తరువాత అక్టోబరులో మళ్ళీ పత్రికలే మోసుకొచ్చాయి శర్మ మరణించాడని.

మద్రాసులో అరెస్టుచేసి 12 రోజులపాటు జైల్లో వుంచారు. హింసించారు. తిరిగి గుంటూరులో అరెస్టుచేసి 14 రోజులపాటు నానాచిత్రహింసలు పెట్టారు. రహస్యాలు బయటపెట్టించాలని ఆయనపై చేసిన దారుణాలకు అంతులేదు. కాని ఒక్క రహస్యమూ బయటపడలేదు.

ప్రజా శత్రువులైన ఇనాందారీ భూస్వామ్య దోపిడీ వర్గాలు పోయి ప్రభుత్వం ముందర మొరలు పెట్టుకున్నారు, శర్మ బ్రతికి వుంటే మేం బ్రతకలేమని.

## కాంగ్రెస్ పాలనలో

అది కాంగ్రెస్ పాలన. 3 సంవత్సరాలుగా తెలుగునాడునంతా మిలటరీ బలగాలచేత ధ్వంసంచేయిస్తూ, ప్రజాసామాన్యం మీద మూకవుమ్మడి దౌర్జన్యాలు సాగిస్తూ అరెస్టులు, లాఠీచార్జీలు, చిత్రహింసలు, మానభంగాలు, కాల్పులు ఒకటా? అన్ని ఫాసిస్టు చర్యలకూ తలపడి రాక్షసత్వం మూర్తీభవించిన కాంగ్రెస్ దాని మిలటరీ

బలగాలు, తమ సహచరులైన భూస్వాముల ఘోరలు విన్నారు. కామ్రేడ్ శర్మను దారుణంగా హింసించి 1950 అక్టోబరు 9న హత్య చేశారు.

కాన్‌సెంట్రేషన్ కాంపు (పాములపాటి కృష్ణయ్య చౌదరి) మేడమీది నుంచి దూకాడనీ, అందువల్ల చనిపోయాడనీ పచ్చి అబద్ధాన్ని ప్రచారం చేశారు. ఈ "సత్య" "అహింస"ల కాంగ్రెస్ ప్రభుత్వాధినేతలు.

ఆ వీరుని శవాన్నైనా బంధువుల కివ్వాలనీ, కనీసం చూపాలనీ కూడా ఈ రాక్షసులు భావించలేదు.

14 రోజులుగా మిలటరీ బలగాలు ఆయనమీద సాగించిన హింసాకాండకు ఆయన శరీరం ప్రజలముందు ప్రబలసాక్ష్యంగా నిలబడుతుంది.

-- బొల్లిముంత శివరామకృష్ణ

తన బానిస స్థితిని గూర్చి చైతన్యాన్ని కలిగి, తన విముక్తికోసం పోరాడేందుకు పైకిలేచిన బానిస, అప్పుడే సగపాలు బానిస కాడన్నమాటే. అధికస్థాయి ఫ్యాక్టరీ పరిశ్రమలో పెరిగి పెద్దవాడై పట్నవాస జీవనం చేస్తూ లోకజ్ఞానం సంపాదించినట్టి వర్గచైతన్యవంతుడైన నేటి కార్మికుడు మత దురభిమానాలను తృణీకారభావంతో విడనాడి స్వర్గ రాజ్యాన్ని మతగురువులకూ బూర్జువావర్గపు ఆషాఢభూతులకూ వదలిపెట్టి ఇహలోకంలో కాస్త మెరుగైన జీవితం కోసం పోరాడి, దానిని సాధించుకుందుకు ప్రయత్నిస్తాడు. మతాంధకారతత్వంపై సాగించే పోరాటంలో విజ్ఞానశాస్త్రం యొక్క సహాయాన్ని వినియోగించు కొంటున్నట్టీ, పరలోకజీవితంపై నమ్మికనుండి కార్మికులను విముక్తిచేసినట్టీ సోషలిజంపక్షాన్నే ఆధునిక శ్రామికవర్గం నిలబడుతుంది. అదేసమయంలో ఈ లోకంలోనే మరింత మెరుగైన జీవితం సాగించే యథార్థమైన పోరాటంలో వారిని సోషలిజం మరింతగా సన్నిహితపరుస్తుంది.

లెనిన్

# పాఠకుల అభిప్రాయాలు

మహాశయా!

98 జనవరి, ఫిబ్రవరి సంచికలలోని కామ్రేడ్ పెదవల్లి శ్రీరాములుగారి "వృద్ధాప్యం ఒక శాపం కారాదు" అనే వ్యాసం చదివాను. చాలా బాగున్నది. మామూలుగా జరిగే విషయాలు మొదలు సిద్ధాంతాలు, రాజకీయాలు అనిపించకుండానే వాటినీ అందులో ఎంతో కొంత జొప్పించగలిగారు. అన్నింటికంటే వారు యిచ్చిన ఉదాహరణలు, చూపిన పోలికలు, చెప్పిన సామెతలు ఎంతో సందర్భోచితంగా వున్నాయి. ఇందులో శ్రీరాములుగారి ప్రత్యేకత ఎప్పుడూ వున్నది. వారికి నా ధన్యవాదములు.

ఒక విషయములో వారు చెప్పిన దానికి నేను మరో ఉదాహరణ ఇస్తే దాన్ని వారు తప్పక స్వీకరింస్తారనే అనుకుంటాను.

మొదటి సంచికలో "వృద్ధుల దీనాలాపన" అనే ఉపశీర్షిక క్రింద సాధారణంగా వృద్ధులయిన భార్యలు ముత్తయిదు చావును కోరుకుంటారు అని వ్రాశారు. ఇక్కడే ఒక ఉదాహరణ ఇస్తాను.

ఇటీవల నా స్నేహితుని భార్య చనిపోతే పరామర్శిద్దామని (మిత్రుడు రమణ) వారి వద్దకు పోయాను. వీరికి 65 సంవత్సరముల వయసు వుంటుంది. గ్రామస్థాయిలో పంచాయతీ సభ్యులుగా పదిమందికీ పరిచయస్తులుగా, మంచిగా వుంటూ ఆదర్శ దంపతులుగా మంచి పేరున్నది వీరికి. చిన్న వ్యాపారస్తుల కుటుంబం.

ఆయన నాతో అన్న మాటేమిటంటే "కొద్దిరోజులుగా మా ఇద్దరి ఆరోగ్యాలు ఏమంత బాగాలేవు. నేను ముందుపోతే నిన్ను ఎవరు చూస్తారు అని ఆమె బాధపడేది. నేను ముందు పోతే నిన్ను మరీ ఎవరు లెక్కబెడతారు అని నేను అనే వాణ్ణి. ఇటీవల ఇద్దరం ఈ మాటలు రోజూ అనుకుంటూ దుఃఖపడేవాళ్ళం" అని అంటూ నాతో సహా ఎలక్కడున్న నలుగురిచేతా కళ్ళనీళ్ళు పెట్టించినాడు. దీన్ని బట్టి ముత్తయిదు చావు కోరి, ఆయన ఏమైనా ఫర్వాలేదు నేను ముందు దాటుకొంటే చాలు. అని కోరుకొనే వారుగానే వృద్ధ స్త్రీలను పోల్చడం సరికాదేమోనని నా అభిప్రాయం. అట్లని ఆయన చావును ముందు కోరుకున్నారని అర్థం తీయరాదు.

ఇట్లు

కె. చంద్రమోహన్,

శాంతినగర్, కోవూరు, నెల్లూరుజి.

కమ్యూనిజ.

Communism (Telugu Monthly) Regd HVS/78

# "కమ్యూనిజం"

## చందాదార్లుగా చేరండి!

| | | |
|---|---|---|
| విడి ప్రతి | : | రు. 6-00 |
| సంవత్సర చందా | : | రు. 72/- |

సమకాలీన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, తాత్విక, చరిత్ర, సాంస్కృతిక విషయాలపై మార్క్సిస్టు దృక్కోణం నుండి అమూల్యమైన వ్యాసాలను అందించే "కమ్యూనిజం" పత్రిక చందాదార్లుగా చేరండి.

మేనేజర్

"కమ్యూనిజం"
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ-520 004

Printed and Published by Valluri Gangadhara Rao for Visalaandhra Vignana Samithi at Nagarjuna Enterprises,Chandram Buildings, Vijayawada-520 004, Editor: EDUPUGANTI NAGESWARA RAO.

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M105 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.I BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | R Jayamma |
| పేజీలు విడదీసినది | R Jayamma |
| స్కాన్ చేసినది | Saranya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |